శ్రీహర్ష వాసవదత్తా గ్రంథమాల - 10

# అన్నమాచార్యులు - శ్రీరామావతార సంకీర్తనలు



ఆచార్య కానాల నలచక్రవర్తి

శ్రీహర్ష వాసవదత్తా గ్రంథమాల - 10

# అన్నమాచార్యులు - శ్రీరామావతార సంకీర్తనలు

వ్యాఖ్యాత

**ఆచార్య కానాల నలచక్రవర్తి**

వ్యాకరణ శిరోమణి, శిక్షాశాస్త్రి,

ఎమ్.ఎ. (సంస్కృతం), ఎమ్.ఎ. (తెలుగు), ఎమ్.ఇడి,పిహెచ్.డి

ప్రవాచకులు

రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం,

తిరుపతి - 517 507 ఆంధ్రప్రదేశ్

**శ్రీ వేంకటాంబ పబ్లికేషన్స్**

తిరుపతి (ఆం. ప్ర.)

**ప్రథమముద్రణ : 2001**

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి

ప్రతులు : 1000

వెల :- రూ. 50 /-





**ప్రతులకు :-**

**శ్రీమతి కె. లక్ష్మీదేవి**

W/O డాక్టర్ కానాల నలచక్రవర్తి

**ప్రవాచకులు**

రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం,

(డీమ్డ్ యూనివర్సిటీ)

తిరుపతి - 517 507




**ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానం వారి "ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణకుసహాయం" అను పథకపు ఆర్థిక సాహాయ్యం ద్వారా ముద్రింపబడింది**


**ముద్రణ :-**

**అన్నపూర్ణ గ్రాఫిక్స్**

53/4, ఆర్. యస్. గార్డెన్స్

తిరుపతి - 517 507

# అవతారిక

ఆదికావ్యం రామాయణం అన్నా ఆదికవి వాల్మీకి అన్నా నాకు ఎంతో ఆదరం, అభిమానం, భక్తిభావాలు. ఈ భావాలతోనే మహర్షి వాల్మీకి యొక్క అలౌకిక దివ్య భావాలను, విశ్వ కల్యాణగుణాలను, మత ధర్మ నిరపేక్షభావాలను, అంతరంగ గుణగణాలను "విప్లవ వాల్మీకీయం' అనే నా విమర్శనాత్మక గ్రంథంలో వైభవోపేతంగా వివరించాను. ఆ తర్వాత కొన్నాళ్ళకు అన్నమాచార్య సాహిత్యాన్ని వివిధకారణాలవల్ల పరిశీలించడం జరిగింది. అన్నమయ్య అద్వితీయలౌకిక దివ్య భావాలపట్ల నామనస్సు ఆకర్షించడం జరిగింది. ఆపదకర్త వర్ణనారీతులకు అబ్బురపడడం జరిగింది. ఆయన తన సంకీర్తనలలో శ్రీరామ, శ్రీకృష్ణ నరసింహ, అలర్‌మేల్‌మంగ మొదలైన దేవతామూర్తులను వర్ణించిన విధం, రామాయణ, భారత, భాగవత, పురాణాలకు సంబంధించిన గాథలతో ఆయామూర్తులకు గల సంబంధాన్ని అలతి అలతి పదాలతో, అచ్చతెనుగులో, తెలుగువారికి అర్థమయ్యే విధంగా వ్యావహారికభాషలో వర్ణించడంలో చూపిన చొరవ అనన్యసాధ్యం. నేను గతంలోనే "విప్లవవాల్మీకీయం" అనే గ్రంథాన్ని వ్రాసినందువల్ల, ఆదికవి వాల్మీకిపై అనన్యమైన భక్తి భావాలుండడం వల్లను, అన్నమయ్య రచించిన శ్రీరామావతార సంకీర్తనలను ఎన్నుకొని వాటికి వ్యాఖ్యానం వ్రాయడం జరిగింది.

సామాన్యంగా మనకు అన్నమయ్య సంకీర్తనలు యథాతథంగా కనుపిస్తూఉంటాయి. మహామాన్యులు సాధుసుబ్రహ్మణ్యశాస్త్రి, వేటూరు ప్రభాకరశాస్త్రి , ఉదయగిరిశ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ కొండమాచార్యులువారు, వారి తరువాత తరానికి చెందిన శ్రీమాన్ సముద్రాలలక్ష్మణయ్య ఆచార్య సర్వోత్తమరావు ఆచార్య గంగప్ప, ఆచార్య డా॥ మేడసానిమోహన్, యువతరానికి చెందిన శ్రీమతి పాన్నా లీలావతమ్మ శ్రీమతి కేసర్లవాణి మొదలైన వారు అన్నమయ్య సాహిత్యంలో భూరి పరిశ్రమను చేసి అన్నమయ్య తత్త్వాన్ని వివరించినారు. ఎంతమంది ఎలా వివరించినా ఆ సాహిత్యంలోని పదాలు.కొన్ని కొరుకుడు పడడం లేదు. రచయితకు సైతం కొన్ని పదాల అర్థాలపై , పల్లవిలోని భావాలపై సంశయాలు న్నాయి. అయినప్పటికీ అన్నమయ్య రచించిన

సంకీర్తనలపై ఒక అవగాహన ప్రజల్లో తెప్పించాలని ప్రథమ ప్రయత్నంగా అన్నమాచార్యులు -

శ్రీరామావతార సంకీర్తనలు అను పేరిట తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రకటించిన 34 సంపుటాలలోని శ్రీరామ సంకీర్తనలను ఒకచోటికి తెచ్చి ప్రతిసంకీర్తనకు ఒక శీర్షకాన్ని, ప్రస్తావనను, భావాన్ని , విశేషాంశాలను నాబుద్ధికి అందినంతవంకు వివరించియున్నాను. ప్రస్తుతం కేవలం అన్నమాచార్యుల శ్రీరామావతార సంకీర్తనలకు మాత్రమే వ్యాఖ్యానం వ్రాసి పాఠకుల కరకమలాలపై ఉంచుతున్నాను. అన్నమయ్య శ్రీనరసింహావతారసంకీర్తనలు - అన్నమయ్య- శ్రీకృష్ణావతార సంకీర్తనలు, అన్నమయ్య దశావతార సంకీర్తనలు మొదలైన వాటికి వ్యాఖ్యానం చేసి ముద్రణకు సిద్ధంచేసి ఉంచినాను. కాలక్రమేణ అవి వెలుగులోకి వస్తాయని ఆశిస్తున్నాను.

ప్రస్తుతం "అన్నమాచార్యులు - శ్రీరామావతార సంకీర్తనలు" అనే ఈ గ్రంథం అన్నమాచార్యుల రామభక్తికి నిదర్శనాలు. అన్నమాచార్యుల అధ్యాత్మసంకీర్తనలు మొదటిసంపుటం మొదలుకొని శృంగార సంకీర్తనలు 32వ సంపుటం వరకు దాదాపు 73 సంకీర్తనలు సేకరించి పాఠకులకు అందజేయడం జరిగింది.

*దేవదేవం భజే దివ్యప్రభావం*
*రావణాసురవైరి రణపుంగవం* అ.అ.సం.సం1-314 అను సంస్కృత సంకీర్తనతో ఆరంభించి

*రాతి, బతిమ సేసిన రామచంద్ర ! నీ*
*చేతిలోన దానవింతే శ్రీరామచంద్ర !*

అనుసంకీర్తనతో ఈ గ్రంథాన్ని ముగింపజేయడం జరిగింది.

*రాముడిదే లోకాభిరాముఁడి తఁడు*
*గోమున పరవురాముకోపమార్చైనటరే* అ.అ.సం.సం.1-474

అనే ఈ సంకీర్తనలో శ్రీమద్రామాయణంలోని సారాన్నంతా

మొదటినుంచి చివరి వరకున్నది చెప్పి తన సంక్షిప్తతా నైపుణ్యాన్ని రమణీయంగా తెలియజేయడం జరిగింది.

ఇతఁడు తారక బ్రహ్మమీతఁడు సర్వేశ్వరుడితఁడు
రతిక్కెగెలిచిన రక్షించునితఁడు అ.అ.సం.సం.10.159

అనే సంకీర్తనలోకూడా 24,000 శ్లోకాలలోనున్న రామకథను కేవలం 14 వాక్యాలలో చెప్పి వాడుకభాషలో అందరికి తెలిసేవిధంగా రచించడంలో అన్నమయ్య చూపిన నేర్పు అనవతరసాధ్యం.

ఒక కాండలోని కథనుకూడా ఒకేసంకీర్తనలో ఇముడ్చగలడు ఉదా॥

అదే రాముడు సువేలాద్రిపై నిలిచె
యెదిరితివి సీత యిఁక నేమమ్మా! అ.శృసం.సం. 26.178

ఇందు రామాయణం నందలి యుద్ధకాండ సంక్షిప్తంగా వివరించబడింది. ఇలా ఒక కాండంలోని కథను ఒక సంకీర్తనలో, అనేక కాండలలోని కథను కూడా ఒకే సంకీర్తనలలో ఇముడ్చగల ఘనుడు పదకవితాపితామహుడు అన్నమయ్య. ఈ విధంగా శ్రీరామునిగుణగణాలను, శ్రీరాముడి పెండ్లిని, స్తోత్రాలను, గొప్పదనాలను, ఆయాపుణ్యక్షేత్రాలలోని శ్రీరామ దేవాలయాలలోని మూర్తుల దివ్యమహిమలను, రావణసంహార వైభవాన్ని, రామాయణ పఠనఫలాలను అత్యద్భుతంగా వివరించి శ్రీమద్రామాయణాన్ని అందరికే అర్థమయ్యేటట్లు వివరించడం జరిగింది. ఈ విషయాలనన్నింటిని వ్యాఖ్యాన రూపంలో మరింత వివరించడం జరిగింది. అన్నమయ్య సాహిత్యంపై అభిమానమున్న విద్వాంసులకు గాయకులకు, పాఠకులకు ఈ గ్రంథం ఏ కొంచెం ఉపయోగపడినా నా పరిశ్రమకు ఫలితం దక్కుతుందని భావిస్తున్నాను.

ఇట్లు
వ్యాఖ్యాత
**కానాల నరలచక్రవర్తి**

# అంకితం

అనురాగానికి

ఆప్యాయతకు మారుపేరై

బాల్యంనుంచి మరణించేవరకూ

అన్నివిధాల సహాయసహకారాలనందిస్తూ

మా ప్రగతికి శ్రేయస్సుకు

అహర్నిశలూ పాటుపడిన

మహామానవతావాదులునైన

కీర్తిశేషురాలు మా అక్క

**కానాల సూర్య సుబ్బమ్మకు** గారలకు

భక్తిపూర్వకంగా . . . . . . .

# కృతజ్ఞతానివేదనం

అన్నమయ్య రచించిన సంకీర్తన సంపుటాలు తిరుమల తిరుపతి దేవస్థానాల తరపున ఎప్పుడో ప్రకాశించినారు. అయితే వాటి ప్రతులు ఎడిటర్స్ ఆఫీసు (T.T.D) లోగానీ ఎక్కడాగానీ పూర్తిగా లభించలేదు. ఇలాంటి పరిస్థితుల్లో అన్నమాచార్య ప్రాజెక్టుకు చెందిన అనుసంధాన సహాయకురాలు కుమారి. కేసర్లవాణిని కొన్ని అన్నమాచార్య సంకీర్తన గ్రంథాలను అందివ్వగా కొన్ని రామావతార సంకీర్తనలను సేకరించడం జరిగింది. మరికొన్ని సంపూటాలకోసం ఎడిటర్స్ ఆఫీసులో మాన్యమిత్రులు శ్రీరాధారమణగారు సబ్ఎడిటర్ గారి చొరవతో శ్రీకోరాడరామకృష్ణ గారు తన వద్దనున్న కొన్ని అన్నమాచార్య సంకీర్తన గ్రంథాలనివ్వగా అందలి శ్రీరామ సంబంధమైన సంకీర్తనలను సేకరించడం జరిగింది. అయితే మరికొన్ని సంపుటాలు లభించలేదు. వాటికోసం శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని ఆచార్య సర్వోత్తమరావుగారిని సంప్రదించగా వారుకూడా ఎంతో ప్రోత్సాహకరంగా మిగిలిన సంపుటాలను అందజేయగా ఎట్టకేలకు శ్రీరామునికి సంబంధించిన సంకీర్తనల నన్నింటిని సేకరించగలిగినాను. ఈ మహానుభావులందరివల్లను శ్రీరామసంకీర్తనలనే కాక, శ్రీకృష్ణ, నరసింహ, దశావతార సంకీర్తనలను సేకరించగల్గి కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామికి కొంత సేవచేయగలిగినాననే తృప్తిని మిగుల్చుకున్నాను.

ఈ మహాయజ్ఞంలో తోడ్పడిన పైన పేర్కొన్న విద్వాంసులందరికీ పేరుపేరునా కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను. అంతేగాక ఈ గ్రంథప్రకాశానికి అవసరమైన ఆర్థిక సహాయాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యానికి, ఎడిటర్ టి.టి.డి వారికి అన్నపూర్ణాగ్రాఫిక్స్ యాజమాన్యానికి సర్వదా కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను.

# విషయసూచిక


| వరుస నెం. | విషయం | పేజి నెం. |
|---|---|---|
| 1. | శ్రీరాముని వైభవము | 1 |
| 2. | శ్రీరామచంద్రకథ | 2 |
| 3. | సంక్షిప్త రామ కథ | 4 |
| 4. | శ్రీరాముని సాహసాలు | 5 |
| 5. | రామకథ రమణీయత | 7 |
| 6. | శ్రీరాముని గొప్పదనం | 8 |
| 7. | శ్రీరాముని వివిధగుణాలు | 10 |
| 8. | శ్రీరాముని స్తోత్రం | 11 |
| 9. | | 13 |
| 10. | శ్రీరాముని గొప్పదనం | 14 |
| 11. | శ్రీరామనతి | 15 |
| 12. | సంక్షిప్తరామకథ | 17 |
| 13. | శ్రీరామశరణం | 18 |
| 14. | సీతమ్మకు విన్నపం | 20 |
| 15. | శ్రీరాముని అద్భుతాలు | 21 |
| 16. | వానరకార్యాలు | 22 |
| 17. | శరణాగతిఫలం | 24 |
| 18. | భక్తుల విన్నపాలు | 25 |
| 19. | శ్రీరాముని శౌర్యం | 27 |
| 20. | శ్రీరాముని దాసపాలనం | 29 |
| 21. | దాసరిపల్లె శ్రీరాముని వైభవం | 30 |
| 22. | శ్రీరాముని గొప్పదనం | 31 |
| 23. | శ్రీరాముని కటాక్షాలు | 32 |
| 24. | శ్రీరామనామాలు | 34 |
| 25. | శ్రీరామునికి నివేదన | 36 |
| 26. | గుత్తి శ్రీరాముని వైభవం | 37 |
| 27. | శ్రీరాముని కీర్తిచంద్రికలు | 38 |
| 28. | శ్రీరాముని గొప్పదనాలు | 40 |
| 29. | శ్రీరాముని భిన్న నామాలు | 41 |
| 30. | భక్తుల భావనలహరిలో రాముడు | 42 |
| 31. | శ్రీరాముని దివ్యగుణాలు | 44 |
| 32. | సంక్షిప్త రామకథ | 45 |
| 33. | శ్రీరాముని జన్మ- ఆయన గొప్పదనం | 47 |
| 34. | సంస్కృత సంకీర్తన | 48 |

| | | |
|---|---|---|
| 35. | విజయనగర రాముని వైభవం | 49 |
| 36. | శ్రీరాముని అద్భుతాలు | 51 |
| 37. | భక్తసులభ రాముడు | 53 |
| 38. | శ్రీరాముని ఘనకార్యాలు | 54 |
| 39. | సంక్షిప్తయుద్ధం | 55 |
| 40. | శ్రీరాముని దివ్యమహిమలు | 57 |
| 41. | శ్రీ రాముని ప్రతాపానికి రాక్షసులు బెదరిపోవడం | 59 |
| 42. | శ్రీరామబాణ మహిమ | 60 |
| 43. | శ్రీరాముని శరణువేడండని రాక్షసులకు హితవు చెప్పడం | 62 |
| 44. | ఉత్తరరామకథ | 63 |
| 45. | శ్రీవేంకటరాముడు | 65 |
| 46. | శ్రీరాముని అద్భుతనామాలు | 66 |
| 47. | శ్రీరామసేవ | 67 |
| 48. | శ్రీరామనుతి | 69 |
| 49. | సామంతుల కానుకలు | 70 |
| 50. | శ్రీరాముని సాహసగాథలు | 71 |
| 51. | శ్రీరాముని ప్రతాపం | 73 |
| 52. | శ్రీరాముని భవ్యగుణాలు | 74 |
| 53. | శ్రీరాముని గుణగణాలు | 76 |
| 54. | శ్రీరాముని దివ్య ప్రభావం | 77 |
| 55. | శ్రీరాముని దైవతత్త్వం | 79 |
| 56. | శ్రీరాముని విజయాలు | 80 |
| 57. | భక్తుల ప్రశంసలు | 82 |
| 58. | అన్నమయ్య ద్వారా సైనికులకు ప్రోత్సాహం | 83 |
| 59. | రావణ సంహారం | 85 |
| 60. | వాల్మీకి వైభవం | 86 |
| 61. | భక్తుల ఆనందం | 87 |
| 62. | రామాయణ ఫలితం | 89 |
| 63. | రాక్షసులకు బెదరింపు | 91 |
| 64. | శ్రీరామానుయాయులకు విన్నపం | 92 |
| 65. | గండికోట శ్రీరాముని అద్భుతాలు | 93 |
| 66. | శ్రీరాముని సాహసాలు | 95 |
| 67. | సీతమ్మ ఆనవాల్లను హనుమంతుడు చూపించడం | 96 |
| 68. | సంక్షిప్త యుద్ధకాండ | 97 |
| 69. | శ్రీరామునిపై ఒక ప్రియురాలి ప్రేమ | 99 |
| 70. | శ్రీరాముని పెండ్లిసందడి | 101 |
| 71. | శ్రీరాముని సోయగాలు | 102 |
| 73. | శ్రీరామునిపై మరులుగొన్న ప్రేయసి | 103 |

# శ్రీరాముని వైభవము

ఈ సంకీర్తనలో శ్రీరామచంద్రుని గూర్చి వర్ణించబడింది. సంస్కృతంలో వ్రాసిన ఈ సంకీర్తనలో శ్రీరాముని కల్యాణగుణాలు వర్ణించబడినాయి. ఏఏ శుభగుణాలతో శ్రీరాముడు విలసిల్లుతున్నాడనేది ఇందు తెలియజేయడం జరిగింది. సకల కల్యాణ గుణాలు కల్గిన దేవదేవున్ని సేవిస్తున్నానని తన్మయత్వంతో అన్నమయ్య మనకు భక్తి తత్వాన్ని నూరిపోస్తున్నాడు.

రాగం : ధన్నాసి

పల్లవి : దేవదేవం భజే దివ్యప్రభావం
రావణాసురవైరి రణపుంగవం ॥ దేవ ॥
రాజవర శేఖరం రవికుల సుధాకరం
ఆజానుబాహు నీలాభ్రకాయం
రాజారికోదండ రాజదీక్షాగురుం
రాజీవలోచనం రామచంద్రం ॥ దేవ ॥
నీలజీమూత సన్నిభశరీరం ఘన
విశాలవక్షం జలజనాభం
తాలాహినగహరం ధర్మసంస్థాపనం
భూలలనాధిపం భోగిశయనం ॥ దేవ ॥
పంకజాసన వినుత పరమనారాయణం
శంకరార్జితజనక చాపదళనం
లంకావిశోషణం లాలితవిభీషణం
వేంకటేశం సాధు విబుధ వినుతం ॥ దేవ ॥

అ.అ.సం.సం. 1.314

రావణాసుర శత్రువుని, యుద్ధంలో శ్రేష్ఠుని, దివ్యమైన ప్రభావం గల వానిని, దేవదేవుడైన శ్రీరామున్ని నేను సేవిస్తున్నాను అని పల్లవి ఎత్తుకుంటున్నాడు. రాజులలో శ్రేష్ఠుడైన మూర్ధన్యుని, సూర్యకులానికి చంద్రుని

వంటివానిని, శత్రురాజులకు కోదండంవంటి వారికి మోకాళ్ళ వరకు చేతులు గల వానిని, నీలమేఘవంటి శరీరం గల వానిని, రాజ దీక్ష గలవానిని, పద్మాలవంటి కన్నులుగల వానిని, విశాలమైన బొమ్మగలవానిని, స్వచ్ఛమైన పద్మాన్ని నాభిలో గలవానిని, ధర్మాన్ని చక్కగా స్థాపించేవాన్ని, భూదేవి భర్తయైన వాన్ని, ఆదిశేషునిపై శయనించే వాన్ని, బ్రహ్మతో స్తోత్రం చేయబడే పరమనారాయణున్ని, శివధనుస్సును విరిచిన వాన్ని, లంకానాశకున్ని, విభీషణుని చేరదీసిన వాన్ని, సాధువులతోను విద్వాంసులతోను స్తుతింపబడేవాన్ని, దేవదేవుడు దివ్య ప్రభావం గలవాడైన శ్రీరామ చంద్రున్ని నేను సేవిస్తున్నాను. ఆయన ఎవరో కాదు. ఆయన వేంకటాద్రిపైనే ఉన్న శ్రీవేంకటేశ్వరుడని లెస్సగా తెలుసుకోవలసిందని సందేశమిస్తున్నాడు పదకర్త తాళ్ళపాకఅన్నమయ్య.

ఇక్కడ ఉపయోగించిన పదాలన్నీ ద్వితీయా విభక్తికి సంబంధించినవే. కేవల ద్వితీయాంత పదాలతో వ్రాయడం ఈ సంకీర్తన ప్రత్యేకత. ఇందు "భజే" అనే క్రియాపదాన్ని చేర్చడం వల్ల సంకీర్తనకు అర్థం చక్కగా స్ఫురిస్తూ ఉంది.

## శ్రీరామచంద్రకథ

(రామాయణకథ)

ఈ సంకీర్తనలో శ్రీరామకథను తెలియజేస్తూ శ్రీరాముని సాహసగాథలను వివరిస్తూ శ్రీరాముని చిఱుతవయస్సు నుండి రావణసంహారం వరకు జరిగిన రామాయణ సారాన్ని తెలిపి ఆనాటి శ్రీరాముడే ఈనాడు శ్రీవేంకటగిరిపై వెలిసి భక్తులకు అభయమిస్తున్నాడని అన్నమయ్య పరమాద్భుతంగా తెలియజేస్తున్నాడు.

రాగం : వరాళి

పల్లవి : రామ ! రామచంద్ర ! రాఘవా ! రాజీవలోచన ! రాఘవా !
సౌమిత్రి భరత శత్రుఘ్నులతోడ జయమందు దశరథరాఘవా !

**2**

1. శిరసుకూకటుల రాఘవా ! చిన్నారి పొన్నారి రాఘవా !
గరిమనావయసునఁదాటకి ఁజంపిన కౌసల్యనందన రాఘవా !

అరిది యజ్ఞముగాచు రాఘవా ! అట్టె హరి విల్లువిరిచిన రాఘవా !
సిరులతో జనకుని ఇంటను జానకిఁజెలఁగి పెండ్లాడిన రాఘవా !

2. మలయు నయోధ్యారాఘవా ! మాయామృగాంతక రాఘవా !
చెలఁగి చుప్పనాతి గర్వమడఁచి దైత్యసేనలఁజంపిన రాఘవా !
సొలసివాలి జంపిన రాఘవా! దండుసుగ్రీవునేలిన రాఘవా !
జలధి బంధించిన రాఘవా ! లంకసంహరించిన రాఘవా! ॥రామ॥

3. దేవతలు చూడ రాఘవా! నీవు దేవేంద్రురథమెక్కి రాఘవా!
రావణాదులనుఁజంపి విభీషణురాజ్యమేలించిన రాఘవా !
వేవేగ మరలి రాఘవా !వచ్చి విజయపట్టమేలి రాఘవా !
శ్రీవేంకటగిరిమీఁద నభయము చేరి మాకిచ్చిన రాఘవా ! ॥రామ॥

అ.అ.సం.సం.1.392

ఓ రామ ! రామచంద్ర ! రఘుకులానికి చెందినవాడా ! పద్మాలవంటి కన్నులను గలవాడా ! రాఘవా ! లక్ష్మణభరత శత్రుఘ్నులతోడ జయము నొందవలసిందని దశరథరాఘవుని ఆశాసిస్తున్నాడు పదకర్త అన్నమయ్య.

శిరసు కూకటుల రాఘవా ! చిన్నారి పొన్నారి వయసులోనున్న రాఘవా ! ఇలాంటి చిన్న వయసులోనే తాటకిని చంపినట్టి కౌసల్యకు కుమారుడవైన రఘువంశ ఔరసునివి. ప్రయత్నించి యజ్ఞాన్ని కాపాడునట్టి రాఘవునివి. అట్లే శివధనుస్సును విరిచినట్టివాడవు. సంపదలతో జనకుని ఇంట ఉన్న సీతను పెండ్లాడి నట్టి రాఘవునివి.

ప్రకాశించే అయోధ్యలో నున్నట్టి రాఘవునివి. మాయలేడిని చంపిన రాఘవునివి. చెలరేగి శూర్పణఖ గర్వాన్ని అణచి రాక్షససేనలను చంపినట్టి రాఘవునివి. సొలసి వాలినిచంపిన రాఘవునివి. సుగ్రీవుని సైన్యాన్ని ఏలిన రాఘవునివి. సముద్రానికి అనకట్ట కట్టినవానివి.లంకను నశింపజేసిన రాఘవునివి.

దేవతలు చూడగా, యుద్ధం పూర్తియైన పిమ్మటనీవు దేవేంద్రుని రథ మెక్కినట్టి వానివి. రావణుడు మొదలైన రాక్షసులను చంపి విభీషణునితో రాజ్యాన్ని

ఏలించినట్టి వాడవు. వేవేగ మరలి వచ్చి విజయం సాధించి పట్టాభిషేకం చేసుకొని అయోధ్యనేలి శ్రీవేంకటగిరి చేరి మాకు అభయాన్నిచ్చినట్టి రాఘవునివి అని శ్రీరాముని ఘనకార్యాలను ఈసంకీర్తనలో సవివరంగా తెలియజేశాడు అన్నమయ్య. 'రాఘవ' అనే పదాన్ని మాటిమాటికి వాడడం ఇక్కడి ప్రత్యేకత.

"అర్థమాత్రా లాఘవం" సంపాదించగానే వైయాకరణులు పుత్రోత్సవం నాటి ఆనందంతో ఉంటారు. అలాగే అన్నమయ్య. ఆయన 24,000 వేల శ్లోకాలలోని సారాన్ని 10 వాక్యాలలో చెప్పి (ఆనందాన్ని పొందడంలో దిట్ట) వైయాకరణులవలె ఆనందాన్ని పొందేవాడు. బాలశ్రీరాముడు తాటకిని చంపింది మొదలు రావణుని చంపి సీతను తెచ్చేంతవరకు జరిగిన రామాయణ కథను రమణీయంగా చెప్పిన దిట్ట అన్నమయ్య. శ్రీమద్రామాయణాన్ని సంక్షిప్తంచేసి శ్రీరాముని జయాలను, సాహసకృత్యాలను, దుష్టసంహారాన్ని ఈ సంకీర్తనలో కళ్ళకు కట్టినట్లు చూపించడం ఇందులోని ప్రత్యేకత.

రాగం : సాళంగనాట

# 3

పల్లవి : రాముఁడిదే లోకాభిరాముఁడితఁడు
గోమున పరశురాముకోప మార్చెనటరే ॥ రాముఁ ॥

1. యీతఁడా తాటకిఁజించె యీపిన్నవాడా !
ఆతల సుబాహుఁగొట్టి యజ్ఞము ఁగాచె
చేతనే యీ కొమరుఁడా శివుని విల్లు విఱిచె
సీతకమ్మ ఁబెండ్లాడె చెప్పఁగొత్త గదవె! ॥రాముఁ॥

2. మన కౌసల్యకొడుకామాయామృగము నేసె
దనుజుల విరాధుని తానే చెఱిచె
తునుమాడె నేడు దాళ్ల తోడనే వాలి నడఁచె
యినకులుఁడితఁడా యెంతకొత్త చూడరే ॥రాముఁ॥

3. యీ వయసు తానే యాయెక్కువ జలధిగట్టి
రావణుఁజంపి సీతమరలఁదెచ్చెను
శ్రీవేంకటేశుఁడితఁడా సిరుల నయోధ్య యేలె
కావున నాటికి నేఁడు కంటిమిట్టె కదరే! ॥రాముఁ॥

అ.తి.సం.సం.1.474

ఇదిగో ! రాముడు. ఈయనే లోకాభిరాముడు. పరశురాముని కోపాన్ని గోమున చల్లార్చింది ఈయనే అని పల్లవిలో రామున్ని వ్రేలుపెట్టి చూపించునట్లు చూపిస్తున్నాడు. శ్రీరామున్ని మనకు పరిచయం చేసే విధానమే ఇది.

ఆ తాటికిని చంపింది ఈ చిన్నవాడే. ఆతర్వాత సుబాహువు అనే రాక్షసున్ని కొట్టి యజ్ఞాన్ని రక్షించింది ఈయనే. సుబాహుని కొట్టిన ఆచేతనే శివుని విల్లు విరిచిన కొమారుడీయనే. సీత అనే కన్యకను పెండ్లాడింది ఈయనే. చెప్పటానికి ఇది కొత్తేకదా !

మన కౌసల్యకొడుకు అనిబంధుత్వం చూపినట్లు ఆ మాయామృగాన్నిచంపి విరాధుని, దండకారణ్యరాక్షసులను చంపింది ఈరాముడే ! ఏడు తాటిచెట్లను నరికి వాలిని చంపిన సూర్యకులానికి చెందినదీ బాలుడే. ఆహా ! ఎంతకొత్తగా ఉన్నాడో చూడరె ! అని తన చెలులకు చూపించునట్లుగ భక్తులకు చూపించుచున్నట్లుగ ఉంది.

నలభై ఏండ్లకు మించని ఈయన సముద్రానికి అనకట్టికట్టి రావణుని చంపి సీతను మరల తెచ్చినాఁడు. ఇతడే ఆ శ్రీవేంకటేశ్వరుడు ఈయనే. ఆ సంపదలుగల అయోధ్య నేలింది రామావతారం నాటి రాముడు. కలియుగపు నేటి వేంకటేశ్వరుడు వీరిద్దరిని ఇలాగే ఇక్కడ చూస్తున్నామే అని అన్నమయ్య ప్రత్యక్షం చేయిస్తున్నాడు శ్రీవేంకటేశ్వరుని లోని రామున్ని ఆ వేంకటేశ్వరునిలోని రామున్ని వేంకటేశ్వరున్నే రామునిగా మనకు పరిచయం చేస్తున్నాడు.

## శ్రీరాముని సాహసాలు

కడపజిల్లా ఒంటిమిట్టలోని శ్రీరాముని దర్శించినపుడు ఆవీరరఘురాముని చూచి ఆయన సాహసకృత్యాలను ఈ సంకీర్తనలో తెలియజేసినాడు పదకర్త అన్నమయ్య. ఒంటిమిట్టలోని వీరరాఘవుని సాహసకృత్యాలను, మహిమలను, భగవత్తత్వాన్ని రమణీయంగా వర్ణించడం జరిగింది.

4

రాగం : నాట

పల్లవి : ఇందులోనె కానవద్దా ! యితఁడు దైవముని
విందువలె నొంటి మిట్ట వీరరఘురాముని ॥ ఇందు ॥

1. యెందుజొచ్చె బ్రహ్మవరమిల రావణుతలలు
కందువ రాఘవుఁడు ఖండించునాఁడు
ముందట జలధి యే మూల చొచ్చెఁగొండలచే
గొంది బంఁడఁగట్టివేసి కోపగించే నాఁడు ॥ ఇందు ॥

2. యేడనుండె మహిమలు యిందరి కితఁడు వచ్చి
వేడుకతో హరివిల్లు విఱిచే నాఁడు
వోడక యింద్రాదు లెందు నొదిగిరీతని బంటు
కూడఁబట్టి సంజీవికొండ దెచ్చేనాఁడు ॥ ఇందు ॥

3. జముఁడెక్కడికిఁబోయ సంయులో మోక్ష
మమర జీవులకిచ్చె నల్లనాఁడు
తెమలి వానరులై యీ దేవతలే బంట్లైరి
తిమిరి శ్రీవేంకటపతికి నేఁడు నాఁడు ॥ ఇందు ॥

అ.అ.సం.సం.1.477

ఈ కార్యాలతోనే తెలుసుకొనవచ్చు ఈయన దైవమని ఈ ఒంటిమిట్టలో వీరరఘురాముని చూస్తే విందు భోజనం వలె ఉంటుందని పల్లవిలో చెప్పడం జరిగింది.

రావణుడు చావులేకుండా బ్రహ్మతో వరాలు సంపాదించినాడు. కాని శ్రీరాముడు రావణుని తలలు ఖండించే నాడు రావణునికి బ్రహ్మఇచ్చిన వరాలేమయినాయి.

ఎంతో సంతోషంతో శ్రీరాముడు వచ్చి శివుని విల్లును విరిచిననాడు ఇతరులకులేని మహిమలు ఈయనకు ఎక్కడినుండి వచ్చినాయి. ఈయన బంటు హనుమంతుడు సంజీవికొండ తెచ్చేనాడు ఇంద్రుడు మొదలైనవారు ఓడక ఎక్కడ దాక్కున్నారు.

సరయూనదివద్ద అమరజీవులకు మోక్షమిచ్చేటప్పుడు యముడు ఎక్కడికి పోయినాడు. శ్రీరామావతారంనాడైనా శ్రీవేంకటేశ్వరుని అర్చావతారం నాడైనా ఈ దేవతలే వానరులై బంటులైనారు. ఈ సంకీర్తనలో శ్రీరాముని అలౌకిక మహిమలు తెలియజేయబడినాయి.

## రామకథ రమణీయత

సామాన్యంగా ఎవరైనా ఒక మంచిపని చేయబోతే అది ఇంకొకరికి చెడ్డ పనిగా ఎదురౌతూ ఉంటుంది.

లోకంలో ఒక శుభకార్యం జరిగితే అది కొందరికి అశుభకార్యంగా అవుతూ ఉంటుంది. ఈ అంశాలనే అన్నమయ్య చిత్ర విచిత్రంగా ఉదాహరణ ప్రత్యుదాహరణలతో రామాయణాన్ని కథావస్తువుగా తీసికొని ఋజువు చేస్తూ ఉన్నాడు. ఈ కార్యాలకన్నింటికీ దేవుడేకదా మూలం. ఈయనను ఎలా నమ్మొచ్చు ? అని ఆయన గొప్పదనాన్ని తెలుపుతూ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాడు.

రాగం : సామంతం

పల్లవి : నూఁతులు దవ్వఁగబోతే బేతాళములు పుట్టె
కాఁతాళపు లోకులాల ! కంటిరా ! యీ సుద్దులు
॥ నూఁతులు ॥

1. మీఱిన పుత్రకామేష్టి మించి లంకకుఁబైవచ్చె
ఆఱడి రామావతార మసురబాధ
తూఱి సీత పెండ్లి హరుదొడ్డ వింటి పండుగాయ
పాటిపాటి నమ్మ నెటువలెవచ్చువీరిని ॥నూఁతులు ॥

**5**

2. చూడకేకయ రాజ్యము చుప్పనాతిపాపమాయ
వేడుక మాయామృగము వేఁటాయను
వాడికె సుగ్రీవుమేలు వాలికి గండాన వచ్చె
యీడుగాని రాచపుట్టు యెట్టు నమ్మవచ్చును
॥ నూఁతులు ॥

3. వుమ్మడిఁగోఁతులకూట ముదధకి ఁగట్లు వచ్చె
తమ్ముని బుద్ధి రావణుతల వోయను
పమ్మి శ్రీవేంకటేశుని పట్టానికే యింలూనాయ
యిమ్ముల నిట్టి దేవర నెట్టు నమ్మవచ్చును

॥ నూఁతులు ॥

అ.అ.సం.సం.2.7

నూతులు త్రవ్వడానికి పోతే బేతాళులుపుట్టినాయట. ఓ భూమండల లోకులారా ! చూచారా ! విన్నారా ! ఈ సూక్తులును అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాడు.

దశరథుడు పుత్రకామేష్టి చేస్తే అది లంకకు చేటు అయింది. రాముడు అవతారం ఎత్తుతే ఆ అవతారం రాక్షసులకు బాధ కల్గించింది. సీత పెండ్లి శివుని విల్లుకు ముప్పు అయింది. ఇలాంటి ఈ రామున్ని ఎలా నమ్మవచ్చు ?

చూడడానికి కేకయ రాజ్యం (కైక కోరికమీద వచ్చిన రాజ్యం) సుప్పనాతి (కైకేయి) పాపమైంది. మాయామృగము వేట అనే వేడుకైంది. సుగ్రీవుని మేలు వాలికి ప్రాణ గండమైంది. ఇన్ని గొప్పకార్యాలను చేసే ఈడుగాని రాకుమారుని ఎలానమ్మవచ్చు?

సగరుని పుత్రులు వుమ్మడిగా తవ్విన గుంతకు (సముద్రం) కట్లు (ఆనకట్ట) వచ్చినాయి. విభీషణ తమ్ముని బుద్ధివల్ల రావణుని తల ఎగిరింది. ఇదంతా శ్రీవేంకటేశ్వరుని పట్టాభిషేకానికే జరిగింది. ఇలాంటి దేవున్ని ఎలానమ్మవచ్చు? అని తెలుపడం జరిగింది ఈ సంకీర్తనలో. ఇందు యుక్తి ప్రత్యుక్తులను తెలియస్తూ ఒకపని చేస్తే అది ఇంకొకరికి కీడుగా దాపురించింది అని పదకర్త ఎంతో చమత్కారంగా భగవల్లీలను తెలియజేస్తున్నాడు.

## శ్రీరాముని గొప్పదనం

శ్రీవావిలిపాటి రాముడంటే ఎవరో ఈయన గొప్పదనమేమో ఆయన చేసిన ఘనకార్యాలేవో ఆయన ఎవరెవరికి ఎలాంటివాడో ఆయనను కొలువవలసిన ఆవశ్యకతను గూర్చి ఈ సంకీర్తనంలో తెలియజేస్తున్నాడు పదకర్త.

6

రాగం : శుద్ధవసంతం

పల్లవి : దీనరక్షకుఁడఖిల వినుతుఁడు దేవదేవుఁడు రాముఁడు
జానకీపతి గొలువుఁడీ ఘన సమర విజయుఁడు రాముఁడు
॥ దీన ॥

1. హరుని తారక బ్రహ్మమంత్రమైయమరిన యర్థము రాముడు
సురలఁగాచి యసురల నడఁచిన సూర్యకులజుఁడు రాముడు
సరయునందును ముక్తి చూరలు జనుల కొసఁగెను రాముఁడు
హరియె యీతఁడు హరివించుల కాదిపురుషుఁడు రాముడు
॥ దీన ॥

2. మునుల రుషులకు నభయ మొసఁగిన మూలమూరితి రాముఁడు
మనసులోపల బరమ యోగులు మరుగుతేజము రాముఁడు
పనిచి మీఁదటి బ్రహ్మపట్టము బంటు కొసఁగెను రాముఁడు
మనుజవేషము తోడ నగజకు మంత్రమాయెను రాముఁడు ॥ దీన ॥

3. బలిమి మించిన దైవికముతో భక్తసులభుఁడు రాముఁడు
నిలిచి తనసరిలేని వేలుపు నిగమవంద్యుఁడు రాముఁడు
మెలుపు మీఁది శ్రీవేంకటగిరి ద్రము మీఁది దేవుఁడు రాముడు
వెలసె వావిలిపాటి లోపలి వీరవిజయుఁడు రాముఁడు ॥దీన॥
అ.అ.సం.సం.2.178

దీనులను రక్షించేవాడు అఖిలప్రజలచే స్తుతింపబడేవాడు దేవదేవుడైన సీతాదేవిభర్త శ్రీరాముడు గొప్ప యుద్ధంలో విజయాన్ని సాధించేవాడీ రాముడు. అట్టి శ్రీరామున్ని కొలువవలసింది అంటున్నాడు పదకర్త.

శివుని తారకబ్రహ్మమంత్రమై అమరిన అర్థం కలవాడు. దేవతలను కాపాడి రాక్షసులను అణగదొక్కిన ఈయన సూర్యకులంలో పుట్టినవాడు, సరయూనది యొద్ద ముక్తి కోరిన జనులకు ముక్తి నిచ్చినవాడు.

ఋషులకు మునులకు అభయమిచ్చిన మూలమూర్తి. పరమయోగుల

మనసులోపల తిరిగే తేజస్సే ఈయన. కార్యాన్ని అప్పజెప్పి దానిని సాధించిన సేవకుడైన హనుమంతునికి బ్రహ్మపట్టానిచ్చినట్టివాడు. మానవ వేషముతో కూడి సీతకు మంత్రమైనట్టివాడు. ఇన్ని ఘనకార్యాలను చేసింది ఈ శ్రీరాముడే.

బలం మించినవాడు దైవాంశసంపన్నుడు. భక్తులకే సులభుడు తనతో సాటిలేని దేవుడు. వేదాలచే నమస్కరింపదగినవాడు. శ్రీవేంకటపర్వతం మీదివాడు. ఈయన వావిలి పాటిలో వెలసినట్టి వీర విజయ రాముడు. ఈయనను కొలువండి అని భక్తులకు శ్రీరామ మహిమను తెలియజేస్తున్నాడు. ఇందు ప్రతి పాదంలోను రామశబ్ద వివరము తెలియజేయబడింది. రామశబ్దానికి నిర్వచనం ఇవ్వబడింది. ఈయనయే మహావిష్ణువు. హరిభక్తులకు అదిపురుషుడు. ఇన్నిటికి పేరుగాంచినవాడు శ్రీరాముడు.

## శ్రీరాముని వివిధగుణాలు

శ్రీరాముని ఆకారాన్ని, వర్ణాన్ని, దుష్టశిక్షణను, గుణగుణాలను ఆయన గొప్పదనాన్ని శ్రీ వేంకటాద్రి పర్వతాన్ని చేరుకొనడం అనే అంశాలకు ప్రాధాన్యమిస్తూ ఈ సంకీర్తన వ్రాయడం జరిగింది.

రాగము: సాళంగనాట

పల్లవి : ఈతఁడు తారకబ్రహ్మమితఁడు మాదేవుఁడు
కౌతుకానఁజెప్పె వినఁగదరే వోజనులు ॥ ఈతఁ ॥

7

1. రాముఁడు యిందీవరశ్యాముఁడు నానాసార్వ
భౌముఁడు షోడశకళాసోముఁడు
దోమటి రాక్షసులను తత్తుమురు సేసినాఁడు
కామిత ఫలములిచ్చి కాచినాఁడు సురల ॥ ఈత ॥

2. పూర్ణుఁడు నీలమేఘవర్ణుఁడు దానమున వి
స్తీర్ణుఁడు వాహన సుపర్ణుఁడు
అర్ణవము దాఁటి రావణాదుల గెలిచినాఁడు
నిర్ణయించి చెప్పరాదు నేఁడీతని మహిమ ॥ ఈత ॥

3. వరుడు సీతకు పరాత్పరుడు కోదండదీక్షా
గురుడు దివ్యామోఘ శరుడితడు
నిరతి శ్రీవేంకటాద్రి నెలవై యుండేటివాడు
సరి భరత లక్ష్మణ శత్రుఘ్న సహితుడు ॥ ఈత ॥

అ.అ.సం.సం. - 2.208

జనులారా ! ఈ శ్రీరాముడు తారక బ్రహ్మం. మా దేవుడు. సంతోషంతో చెప్పే మా మాటలను వినవల్సింది.

శ్రీరాముడు నల్లకలువ రంగును పోలినవాడు. నానారాజులకు ప్రజలకు చక్రవర్తి. పదునారు కళలతో కూడిన చంద్రుని వంటివాడు. తిండిపోతు రాక్షసులను నుగ్గునుగ్గు చేసినాడు. కోరిన కోర్కెల నిచ్చి దేవతలను కాపాడినాడు.

నిండుహృదయం గలవాడు. నీలమేఘ శరీరం గల్గినవాడు. దానాలు చేయడంలో ఉదారుడు. గరుత్మంతునే వాహనంగా గలవాడు. ప్రేమ మీర శ్రీవేంకటాద్రిని వాసంగా చేసుకున్నవాడు. మంచివారైన భరతలక్ష్మణ శత్రుఘ్నులతో కూడుకొన్నవాడు ఈ శ్రీరాముడు అంటూ ఈయన వాస్తవిక గుణగుణాలను అత్యద్భుతంగా తెలియజేస్తున్నాడు పదకర్త.

## శ్రీరాముని స్తోత్రం

శ్రీరాముని వివిధగుణాలను తెలియజేస్తూ శ్రీరామున్ని స్తోత్రం చేసే ఈ సంకీర్తన రాముని పూర్ణత్వాన్ని తెలియజేస్తూ ఉంది. శ్రీరాముని వివిధగుణగుణాలను తెలియజేస్తూ ఆగుణాలతోపాటి ఆయన గొప్పకార్యాలను తెలియజేయడం ఈ సంకీర్తన ప్రత్యేకత.

రాగం : సాళంగనాట

పల్లవి : శరణు శరణు విభీషణవరదా !
శరధిబంధన రామ సర్వగుణస్తోమ ! ॥ శరణు ॥

# 8

1. మారీచ సుబాహు మదమర్దన తాటకాహర
కూర్మేంద్ర జిత్తుల గుండు గండా!
దారుణ కుంభకర్ణ దనుజ శిరచ్ఛేదక !
వీర ప్రతాపరామ విజయాభిరామ ! ॥ శరణు ॥

2. వాలినిగ్రహ ! సుగ్రీవ రాజ్యస్థాపక !
లాలిత వానరబల ! లంకాపహార !
పాలిత సవనాహల్య పాపవిమోచక !
పౌలస్త్యహరణ ! రామబహుదివ్యనామ ! ॥ శరణు ॥

3. శంకర చాప భంజక ! జానకీ మనోహర !
పంకజాక్ష సాకేతపట్టణాధీశ !
అంకితబిరుద ! శ్రీవేంకటాద్రినివాస !
ఓంకారరూప ! రామవురుసత్యకామ ! ॥ శరణు ॥

అ.అ.సం.సం.2.220

విభీషణవరదా ! సముద్రానికి ఆనకట్టకట్టిన ఓ శ్రీరామ ! సర్వగుణాలకు నిలయుడా ! మేము నిన్ను "శరణు" "శరణు" వేడుకుంటున్నాం.

మారీచుడు సుబాహువు తాటక అనే రాక్షసులను చంపినట్టివాడా ! కూర్మావతారం మొదలగు జిత్తులను చూపిన గుండుగండుడా ! దారుణ కుంభకర్ణుడనే రాక్షసుని శిరస్సును నరికిన వీరప్రతాప విజయాభిమామ మేము నిన్ను శరణు వేడుకుంటున్నాము.

వాలిని నిగ్రహించినవాడా ! సుగ్రీవుని రాజ్యమున ప్రతిష్ఠించినవాడా ! వానర బలాన్ని లాలించిన వాడా ! లంకాపహారీ ! అహల్యా పాపాన్ని పోగొట్టిన వాడా ! పౌలస్త్యుని (రావణుని) చంపిన వాడా! అనేక దివ్యనామాలను కలిగిన ఓరామా ! నిన్ను శరణు వేడుచున్నాం.

ఈశ్వరుని ధనుస్సును విరిచిన వాడా ! సీతాదేవి మనస్సును హరించిన వాడా ! పద్మములవంటి కన్నులు గలవాడా ! అయోధ్య పట్టణాధీశుడా ! అంకిత

బిరుడం గలవాడా ! శ్రీవేంకటాద్రిని నివాసము గలవాడా ! ఓంకార రూపుడా ! గొప్ప సత్యకాముడా ! నిన్ను మేము శరణు వేడుచున్నాం అని అన్నమయ్య భక్తుల తరపున వకాలతా పుచ్చుకుంటున్నాడు.

## శ్రీరామస్తోత్రం

శ్రీ వేంకటాద్రిపై వెలకొన్న రాముడు ఇతడే అని వ్రేలుపెట్టి చూపిస్తూ శ్రీ వేంకటాద్రి రాముని గుణగణాలను విశదపరుస్తూ ఈ సంకీర్తనను ఏకవచన పదాలతోనే రచించి సంకీర్తనకు వన్నె చేకూర్చినాడు పదకర్త.

రాగం: పాడి

పల్లవి: రాముఁడు లోకాభిరాముఁడు త్రైలోక్య
ధాముఁడు రణరంగ భీముఁడు వాఁడె ॥ రాముఁ ॥

1. వరుఁడు సీతకు ఫలాధరుఁడు మహోగ్రపు
శరుఁడు రాక్షససంహరుఁడు వాఁడే
స్థిరుఁడు సర్వగుణాకరుఁడు కోదండ దీక్షా
గురుఁడు సేవక శుభకరుఁడు వాఁడే ॥ రాముఁ॥

9

2. ధీరుఁడు లోకైకవీరుఁడు సకలా
ధారుఁడు భవబంధదూరుఁడు వాఁడే
శూరుఁడు ధర్మవిదారుఁడు రఘువంశ
సారుఁడు బ్రహ్మాసాకారుఁడు వాఁడే ॥ రాముఁ॥

3. బలుఁడు యిన్నిటా రవికులుడు భావించని
ర్మలుఁడు నిశ్చలుఁడవికలుఁడు వాఁడే
వెలసి శ్రీ వేంకటాద్రి నిజనగరములోన
తలకొనెఁ బుణ్యాపాదతలుఁడు వాఁడే ॥ రాముఁ॥

అ. అ. సం. సం. 2.219

శ్రీరాముడు లోకాభిరాముడు. త్రైలోక్యధాముడు. రణరంగ భీముడు వాడే అంటూ వేంకటేశ్వరున్ని చూపిస్తున్నాడు.

సీతకు వరుడు, దొండపండులాంటి పెదవిగలవాడు. రాక్షసులను చంపేవాడు, స్థిరంగా ఉండేవాడు. సర్వగుణాలకు నిలయుడు, కోదండదీక్షాధరుడు సేవకులకు శుభాన్ని కలిగించేవాడు వాడే అని తెలియజేస్తున్నాడు.

ధీరుడు, లోకైకవీరుడు. సకలానికి ఆధార భూతుడు సంసారబంధాలను తొలగించేవాడు, శూరుడు, ధర్మవిదారుడు రఘువంశానికి సారభూతమైనవాడు ఆకారం దాల్చిన బ్రహ్మ వీడేనని అంటున్నాడు.

బలం కలవాడు, నిర్మలుడు, నిశ్చలుడు, వికలంలేని వాడు. శ్రీవేంకటాద్రిపై విజయనగరంలో వెలసిన పుణ్యపాదతలుడు వాడేవీడు అంటూ అన్నమయ్య భక్తి సముద్రంలో మునిగి ఎలుగెత్తిచాటుతూ విజయనగరంలోని శ్రీరామున్ని భక్తులకు పరిచయం చేస్తున్నాడు.

## శ్రీరాముని గొప్పదనం

శరణన్న వారిని రక్షించేవాడు శ్రీరాముడు, దుష్టులను శిక్షించేవాడు. శిష్టులను రక్షించేవాడు. అరణ్యంలో ఆటవికునిగా కన్పించినా ఈయన భక్తులకు తారక బ్రహ్మంగా ఉన్నాడు అని తెల్పుతూ ఈయన గొప్పదనాన్ని అన్నమయ్య అలవోకగా చెబుతూ ఉన్నాడు.

రాగం : శంకరాభరణం

పల్లవి : శరణన్న విభీషణుఁ గరుణఁ గాచినవాఁడు
పరికింపఁ దారక బ్రహ్మమా ! యీ రాముఁడు

10

1. ఆలికై విల్లు విఱిచి వాలికై యమ్ము వేసిన
వాలు మగఁటిమి గలవాఁడా వీఁడు
జాలను జలధిగట్టి కేలను మోక్షమిచ్చి
యేలెను జటాయువును యీతఁడా రాముఁడు ॥ శర ॥

2. మింటికట్లు నెగదీసి యంటి పగ సాధించి
దంట రాకుమారుఁడు తానీ శూరుఁడా !
బంటుగా వాయుజునేలినంటు సుగ్రీవుతోఁజేసి
కంటకరావణవైరి ఘనుఁడా ! యీ రాముఁడు ॥ శర ॥

3. రాకాసుల మర్దించి కాకాసురు నటుగాంచి
మైకొన్న జానకీరమణుఁడితఁడా
యీకడ వేంకటాద్రి నిరవై తానునున్నాడు.
నీకొన్న ప్రతాపపుదేవుఁడా యీ రాముఁడు ॥ శర ॥

అ.అ.సం.సం.2. 226

విభీషణుడు "శరణు" అనగానే దయతో రక్షించిన వాడు. పరిశీలించి చూసినట్లయితే ఈయన తారక బ్రహ్మమా ! అని తోచుతూ ఉంది.

ఈయన తన ఆలి సీతకై శివధనుస్సును విరిచినట్టినాడు. వాలిని చంపడానికై బాణము వేసిన వాలుమగటిమి గలవాడు. చేతితో రాళ్ళతో సముద్రానికి ఆనకట్టనుకట్టి, జటాయువుకు మోక్షమిచ్చి ఏలిన వాడా ! ఈ శ్రీరాముడు.

మింటికట్లు తెగవేసి పగసాధించిన శూరుడీ రాముడనే రాకుమారుడు. వాయువు కుమారుడైన తన బంటు హనుమంతుని ఏలినవాడు. సుగ్రీవునితో స్నేహం చేసి కంటకమైన రావణుని శత్రువేనా? ఈ శ్రీరాముడు.

కాకాసురుని రక్షించి, రాక్షసులను చంపిన జానకీరమణుడేనా ఇతడు. శ్రీ వేంకటాద్రిపై ఇరవుగ కూర్చున్న ప్రతాపపు దేవుడేనా ?

ఈ శ్రీరాముడు అని శ్రీరాముడిని గూర్చి ఆశ్చర్యంగా తెలుపుతూ ఉన్నాడు అన్నమయ్య. సౌమ్యంగా, ప్రసన్నంగా, ఉండే ఈ వేంకటగిరి రాముడేనా? ఆనాడు ఈ ఘనకార్యాలు చేసింది అని ఆశ్చర్యపడుతున్నాడు పదకర్త.

## శ్రీరామ నతి

సంస్కృత సంకీర్తన ఇది. ఈ సంకీర్తన అంతా చతుర్థీ విభక్తిరూపాలతో రమణీయంగా ఉంది. శ్రీరాముని పుట్టుకనుంచి శ్రీరామ పట్టాభిషేకం వరకు ఇందులో ఇతివృత్తం ఉంది. ఈ సంకీర్తనలో వావిలి పాటి వీరశ్రీరాముని మహత్వం వివరించబడింది.

# 11

రాగం : శ్రీరాగం

పల్లవి : రా జీవనేత్రాయ రాఘవాయ నమో
సౌజన్య నిలయాయ జానకీరామ ! ॥ రాజీ ॥

1. దశరథ తనూజాయ తాటకదమనాయ
కుశిక సంభవ యజ్ఞ గోపనాయ
పశుపతి మహాధనుర్భంజనాయ నమో
విశద భార్గవ రామవిజయకరణాయ ॥ రాజీ ॥

2. భరిత ధర్మాయ శూర్పణఖాంగహరణాయ
ఖరదూషణాది రిపు ఖండనాయ
తరణి సంభవ సైన్యరక్షకాయ నమో
నిరుపమ మహావారిబంధ నాయ

3. హతరావణాయ సంయమినాథవరదాయ
అతులితా యోధ్యపురాధిపాయ
హితకర శ్రీవేంటేశ్వరాయ నమో
వితత వావిలిపాటి వీరరామాయ ॥ రాజీ ॥

అ.అ.సం.సం.2.273

రాజీవ నేత్రునికి, రాఘవునికి, సౌజన్యనిలయునికి, జానకీరామునికి నమస్కారం అంటూ పల్లవితో వివరించడం జరిగింది.

దశరథుని కొడుకుకు, తాటకిని చంపిన వానికి, కుశికవంశంలో జన్మించిన విశ్వామిత్రునికి యజ్ఞాన్ని రక్షించినవానికి, ఈశ్వరుని గొప్ప ధనుస్సుని విరిచినవానికి, పరశురాముని జయించిన వానికి, ఖరుడు దూషణుడు మొదలైన రాక్షసశత్రువులను చంపిన వానికి, సూర్యవంశ సైన్యరక్షకునికి, సాటిలేని సముద్రానికి ఆనకట్ట కట్టిన వాడైన శ్రీరామునికి నమస్కారం.

రావణుని చంపిన వానికి, వరాలనిచ్చువానికి, సాటిలేని అయోధ్యాపురవాసికి, హితకరుడైన శ్రీవేంకటేశ్వరుని రూపంలో ఉన్న వావిలిపాటి

వీరరామునికి నమస్కారం అని తాను వావిలిపాటలో దర్శించిన రామభద్రునికి నమస్కారాలను తెలుపుకొంటున్నాడు అన్నమయ్య.

## సంక్షిప్త రామకథ

ఈ సంకీర్తనలోను రామాయణ సంక్షిప్త కథ వివరించబడింది. పల్లవి సంస్కృతంలో, తక్కిన మూడు చరణాలు తెలుగులోను ఉండడం ఈ సంకీర్తన ప్రత్యేకత.

రాగం: సాళంగనాట

పల్లవి: కౌసల్యానందన రామ ! కమలాప్త కులరామ !
భాసుర వరద ! జయపరిపూర్ణరామ ! ॥ కౌస ॥

12

1. మునుప దశరథరాముఁడవై తమ్ములనీవు
జనించి తాటకఁ జంపి జన్నము గాచి
వెనుకొని హరువిల్లు విరిచి సీతఁ బెండ్లాడి
అనుమతి పరశురామునిచే గైకొంటివి ॥ కౌస

2. సుప్పనాతి శిక్షించి సారిది రుషుల (గాచి
అప్పుడే ఖరదూషణాదుల గొట్టి
చొప్పుతో మాయామృగము సోదించి హరియించి
కప్పి హనుమంతు బంటుఁగానేలుకొంటివి ॥ కౌస ॥

3. సొలసి వాలినడఁచి సుగ్రీవుఁగూడుక
జలధి బంధించి లంక సాధించి
వెలయ రావణుగెల్చి విభీషణుని మన్నించి
చెలఁగితి వయోధ్యలో శ్రీవేంకటేశుఁడా ॥ కౌస ॥

అ.అ.సం.సం.2.275

కౌసల్యకు సంతోషాన్ని కల్గించేరామా ! తామరలకు ఆప్తుడవైన సూర్యునికులానికి చెందినరామా ! ప్రకాశించువాడవై వరములనిచ్చే రామా ! పరిపూర్ణుడవైన శ్రీరామా ! నీకు జయము.

మునుపు దశరథరాముడవై లక్ష్మణ భరత శత్రుఘ్నులనే తమ్ములతో పాటి పుట్టి తాటకిని చంపి, విశ్వామిత్రుని యజ్ఞాన్ని కాపాడి, తిరిగి శివధనుస్సును విరిచి సీతను పెండ్లాడి గురువుల అనుమతితో పరశురాముని జయించి వైష్ణవధనుస్సును స్వీకరించినావు. అలాంటి నీకు జయం.

శూర్పణఖను శిక్షించి, ఋషులను కాపాడి, ఆ సమయంలోనే ఖరుడు దూషణుడు మొదలైన రాక్షసులను చంపి, ఆ తర్వాత మాయ జింకను వెదకి చంపి హనుమంతుని బంటుగా చేసుకొన్న నీకు జయం.

ఆ తర్వాత సీతకై వెదకి సొలసిన వాలిని చంపి సుగ్రీవుని స్నేహితునిగా చేసుకొని సముద్రానికి ఆనకట్టకట్టి ప్రకాశించి రావణుని, చంపి, లంకను గెలిచి, విభీషణుని మన్నించిన అయోధ్యరాజ్యాన్ని చేపట్టిన శ్రీరామ రూపంలో ఉన్న శ్రీవేంకటేశ్వరా ! నీకుజయం అని జేజేలు పలుకుతున్నాడు అన్నమయ్య. 24వేల శ్లోకాలుగల్గిన శ్రీమద్రామాయణాన్ని 9 చిన్న చిన్న వాక్యాలలో చెప్పిన పదకర్త లాఘవాన్నికి మెచ్చుకోవాల్సిందే మనం.

## శ్రీరామశరణం

శ్రీరామచంద్రుడు ఎన్నెన్నో ఘనకార్యాలను చేసినాడు. ఆఘనకార్యాలను తెలియజేస్తూ ప్రభూ ! నీ వెన్నెన్నో ఘనకార్యాలను చేసినావు. నాకు నాభక్తులకు అనేక సమస్యలున్నాయి. మిక్కిలి కఠినమైన సమస్యలనన్నింటిని నీవు రామావతారంలో పరిష్కరించినావు. అతిస్వల్పమైన మా దైనందిన సమస్యలను పరిష్కరించుస్వామీ ! అని పలుకుతూ గొప్ప గొప్ప సమస్యలను పరిష్కరించిన నీయంత వాడికివొక లెక్కా ? అని ఆస్వామికి భక్తుల తరపున తన తరుపున విన్నవించుకొంటున్నాడు.

రాగం: సాళంగనాట

పల్లవి : రామా ! రామభద్ర ! రవివంశ రాఘవ !
యేమి యరుదిది నీకింత వానికిని

# 13

1. నాఁడు రావణుని తలలు నఱికినలావరివి
నేఁడు నాపాపములు ఖండించరాదా !
వాఁడి ప్రతాపముతోఁడ వారిధి గట్టిన నాటి
వాఁడ విట్టె నా మనోవార్ధిఁగట్టరాదా ! ॥ రామా ! ॥

2. తనిసి కుంభకర్ణాది దైత్యులు గెలువరాదా !
కినిసి నా యింద్రియాల గెలువరాదా !
యెనసి హరునివిల్లు యెక్కుపెట్టి వంచితివి
ఘనము నాదుర్గుణము కడు వంచరాదా ! ॥ రామా ! ॥

3. సరుస విభీషణుఁడు శరణంటే ఁగాచితివి
గరిమనే శరణంటిఁగావరాదా !
తొరలి శ్రీవేంకటేశ ! దొడ్డగొంచమెంచనేల !
యిరవైలోక హితాన కేదైనా నేమీ ॥ రామా ! ॥

అ.అ.సం.సం.2 . 4 37

శ్రీవేంకటేశ్వరుని రూపంలోనున్న రామా ! రామభద్రా ! సూర్యవంశములో పుట్టిన రాఘవా ! నీయంతటి గొప్పవానికి చేయలేని అరుదైన పని ఏదైనా ఉందా ? ముమ్మాటికీ లేదు స్వామీ ! నా కోర్కెలు తీర్చుస్వామి ! అని వేడుకొంటున్నాడు పదకర్త.

ఆనాడు రావణుని పదితలలు ఖండించిన బలవంతునివి నీవు ఈనాడు నా పాపాలను ఖండించలేవా ! వాడి ప్రతాపంతో ఆనాడు సముద్రానికి ఆనకట్ట కట్టిన నీవు ఈనాడు నామనస్సు అనే సముద్రానికి ఆనకట్ట కట్టలేవా ?

ఆనాడు కుంభకర్ణుడు మొదలైన రాక్షసులను గెలిచినావు. మరి ఈనాడు యింద్రియాలను గెలువ లేవా ! ప్రయత్నించి ఆనాడు శివధనుస్సును ఎక్కుపెట్టి వంచినావు. మరి ఈనాడు నాదుర్గుణాన్ని వంచలేవా ?

విభీషణుడు "శరణు" అని ఒక్క మాట అంటే ఆయన్ను రక్షించినావు. నేను ఎన్ని ఎన్నిమార్లు అంటున్నా నన్ను రక్షించలేవా ! కాబట్టి శ్రీవేంకటేశ్వరుని

రూపంలో ఉన్న ఓ రామభద్ర ! లోకహితం కోసం ఎక్కువ తక్కువలను పాటించక అల్పుడనైన నా కోర్కెలను తీర్చు స్వామీ ! అని సవినయంగా వేంకటరామునికి మనవి చేసుకొంటున్నాడు పదకర్త.

## సీతమ్మకు విన్నపం

వానర సైన్యాన్నికూడగట్టి సముద్రానికి ఆనకట్ట కట్టి త్రికూట పర్వతాన్నెక్కి కుంభకర్ణ, ఇంద్రజిత్తు, రావణుడు మొదలైన రాక్షసులను చంపి సీతను చేపట్టినాడు. ప్రతిపని అద్భుతమైందే. ఇంతకింతకు గొప్పపనులు చేసిన శ్రీరాముడు మున్ముందు ఏమేమి చేస్తాడో అని ఆశ్చర్యాన్ని ప్రకటించబోతున్నాడు పదకవితా పితామహుడు అన్నమయ్య.

రాగము: రామక్రియ

పల్లవి: వినవమ్మ ! జానకి! నీ విభుఁడింత సేసినాఁడు
యెనసి యీ రఘురాముఁడిఁక నేమిసేసునో ॥ విన ॥

14

1. వానరుల దండు గూడి వారధికొండల( గట్టి
అని లంక చుట్టిరా నదే విడిసె
కోనలఁద్రికూటమెక్కి గొడగులన్నియుఁజెక్కి
యే నెపాన రఘురాముఁడిఁక నేమిసేసునో ॥ విన ॥

2. కోరి ఇంద్రజిత్తుఁజంపె కుంభకర్ణునిర్జించె
ఘోరదానవుల నెల్ల కూలఁగుమ్మెను.
మారణహోమముసేసె మతకమింతా ఁజెరిచె
యీరసాన రఘురాముఁడిఁక నేమిసేసునో ! ॥ విన ॥

3. లావున రావణుఁజంపె లంక విభీషణు కిచ్చె
చేవల నోసీత నిన్ను ఁజేకొనెను
భావించి శ్రీవేంకటాద్రి ఁబట్టముదా ఁగట్టుకొనె
యీవల నావల నాతఁడిఁక నేమిసేసునో ॥ విన ॥

అ.అ.సం.సం.2. 462






అమ్మా ! జనకరాజపుత్రీ ! నీవు మా మాటలు వినవల్సింది. నీభర్తయైన శ్రీరాముడింతత చేసినాడు. ప్రయత్నించి మరెంత చేస్తాడే ఏమో !

వానరసైన్యంతో కూడి కొండ రాళ్ళతో ఆనకట్టి కట్టినాడు. యుద్ధం చేయాలని లంకనుచుట్టివచ్చి అదే అక్కడ విడిది చేసినాడు. త్రికూటపర్వతం కోనల నెక్కినాడు. అక్కడ తన శ్వేత ఛత్రాలను చెక్కినాడు. ఇంత చేసిన ఆ రఘురాముడు ఇంకెంతచేస్తాడో !

కోరి ఇంద్రజిత్తును చంపినాడు. కుంభకర్ణుని లెస్సగా గెలిచినాడు. భయంకరమైన దానవులనెల్ల కూలద్రోసినాడు. మారణహోమం చేసి రాక్షసుల మాయయంతా చెడగొట్టినాడు. ఈ విధంగా రఘురాముడిక మీదట ఏమేమి చేస్తాడో.

తన బలంతో రావణుని చంపి లంకను విభీషణున కిచ్చినాడు. ఆతర్వాత చేవతో నిన్ను గ్రహించినాడు. ఆ తర్వాత వేంకటాద్రిపై పట్టము గట్టుగొన్నాడు. ఆపైని ఈ పైని ఆయన ఏమిచేస్తాడో అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతున్నాడు అన్నమయ్య. ఈ గొప్పలన్నీ సీతమ్మకు వినిపిస్తున్నాడు అన్నమయ్య.

## శ్రీరాముని అద్భుతాలు

శ్రీరామచంద్రుడు అనేక ఘనకార్యాలు చేశాడు. వాటివల్ల ఆయన కీర్తి ప్రతిష్ఠలనొందినాడు. మరి ఇంతపేరు గాంచిన ఈయన ఆదినారాయణుడేగాని నరుడు కాదు. అని అన్నమయ్య ఎలుగెత్తి చాటుతూ ఉన్నాడు. అందుకు గాను ఈయన చేసిన గొప్పకార్యాలను చూపిన్నా ఈయునను దేవుడనే ధృవపరుస్తున్నాడు ఈ సంకీర్తనలో.

రాగం : సాళంగనాట

పల్లవి : నరుఁడా యీతఁడు ఆదినారాయణుఁడు గాక !
ధరణి గిరితి కెక్కె ! ధరణి సుతుఁడు ॥ నరుఁడా ॥

15

1\. యీతఁడా తాటకిఁజంపె నీమారీచ సుబాహుల
నీతఁడా మదమణఁచె నిందరుఁజూడ
యేతులకు హరువిల్లు యీతఁడా విరిచి యట్టె
సీతఁ బెండ్లియాడెను యీ చిన్నరాముఁడా ష ॥ నరుఁ ॥

2\. చుప్పనాతి ముక్కుఁగోసి సోదించి దైత్యులఁజంపి
అప్పుడిట్టె వాలి నేసి నాతఁడీతఁడా
గుప్పించి కోఁతుల నేలి కొండల జలధి గట్టి
కప్పిలంక సాధించె !నీ కౌసల్యానందనుఁడా ! ॥ నరుఁ ॥

3\. రావణాదులనుఁజంపి రక్షించి విభీషణుని
భావించ యోధ్య నీతఁడు పట్టమేలెను
శ్రీవేంకటేశుఁడితఁడే సృష్టి రక్షించె నితఁడే
యీవల మాపాల నున్న యీ రామచంద్రుడా ॥ నరుఁ ॥

అ.అ.సం.సం.2 . 497

శ్రీరాముడు రాజపుత్రుడు. భూమండలంలో శాశ్వతకీర్తిని పొందినట్టివాడు. అట్టి ఈయన నరుడు కాడు ఆదినారాయణుడే.

ఇందరుచూస్తుండగా తాటకిని చంపి మారీచ సుబాహుల మదాన్ని అణగద్రొక్కి, ఉద్ధతిలో హరివిల్లు విరిచిన సీతను పెండ్లాడిన ఈ చిన్న బాలుడునరుడా ! కాడు ఆదినారాయణుడే అని తేల్చి చెబుతున్నాడు.

శూర్పణఖ ముక్కుచెవులు కోసి వెదకి వదకి రాక్షసులను చంపి, వాలిని చంపి, కోతులనేలి , కొండరాళ్ళతో సముద్రంలో ఆనకట్టను కట్టి, లంకను సాధించిన ఈ కౌసల్యానందనుడు నరుడా ! కాడు కాడు ఆది నారాయణుడే సుమా ! అని తెలియజేస్తున్నాడు నరులకు.

రావణుడు మొదలైన రాక్షసులను చంపి విభీషణుని రక్షించి అయోధ్యపట్టణాన్ని ఏలిన మాపాలిట ఉన్న ఈ రామచంద్రుడే శ్రీవేంకటేశ్వరుడు. ఈయన సృష్టిని రక్షించినాడు. కాబట్టి శ్రీవేంకటేశ్వరుని అంశతో నున్న ఈ

రామచంద్రుడు మానవుడు కాదు సాక్షాత్తు ఆదినారాయణడే అని అన్నమయ్య సిద్ధాంతీకరించినాడు.

## వానరాకార్యాలు

ఈ సంకీర్తనలో రామాయణంలోని యుద్ధకాండలోని విషయాలు తీసికోబడ్డాయి. శ్రీరాముడు వానర సేనల సహాయంతో సముద్రానికి ఆనకట్ట కట్టింది మొదలు విభీషణ పట్టాభిషేకం వరకు ఉన్న అంశాలను అలతి అలతి పదాలతో రమణీయంగా వర్ణించినాడు అన్నమయ్య.

రాగము : సాళంగనాట

పల్లవి : అని రావణుతల లట్టలు (బొందించి
చెనకి భూతములు చెప్పె బుద్ధి ॥ అని ॥

16

1. కట్టిరి జలనిధి కపిసేనలవిగో
చుట్టు లంక కంచుల విడిసె
కొట్టిరి దానవకోట్లతల లదే
కట్టిడి రావణగతియె నీకు ॥ అని ॥

2. యెక్కిరి కోటలు యిందరు నొకపరి
చిక్కిరి కలిగిన చెరయెల్ల
పక్కన సీతరు(బరిణామ మాయు
నిక్కె (క్క?) ము రావణ నీకో(బ్రదకు ॥ అని ॥

3. పరగ విభీషణు (బట్టము గట్టెను
తొరలి లంకకును తొలు(దొలుతే
గరిమెల శ్రీ వేంకటగిరి రాము(డు
మెరసెను రావణ మేలాయ(బనులు ॥ అని ॥

రావణుని పదితలలను నేలమట్టం చేసి రాక్షసులను చంపి వారికి బుద్ధి చెప్పినాడు శ్రీరాముడు.

అవిగో కపిసేనలు సముద్రముపై ఆనకట్ట కట్టినాయి. లంకచుట్టు లంక అంచులవద్ద ఆ్పుఐన్యాలు విడిచి చేసినాయి. ఆ సేనలు కోట్లకొలది దానవ తలలను నరికినాయి. ఓ రావణ ! నీ గతికట్టడి అయింది.

ఒకేసారి వానరసేనలన్నీ కోటలు ఎక్కినాయి. రాక్షసులంతా వానరసేనలకు చిక్కినారు. ప్రక్కన అశోకవనంలో చెరలో ఉన్న సీతమ్మ మార్పు జరిగింది. రావణా! మరల నీకు జన్మం తప్పదు.

తొలుదొల్తనే శ్రీరాముడు విభీషణునికి లంకా పట్టం కట్టినాడు. ఓ రావణా! గొప్పలతోకూడిన శ్రీరాముడే శ్రీవేంకటేశ్వరుడై శ్రీ వేంకటగిరిపై మెరుస్తూ ఉన్నాడు. లోకకల్యాణం జరిగింది అని ఎప్పుడో జరిగిన కథను ఇప్పుడు జరుగుతున్నట్లుగా అన్నమయ్య సినిమారీలులూ రామకథను తన సంకీర్తనలో తెలుపుతున్నాడు.

## శరణాగతిఫలం

శ్రీరాముడు ఎంత గొప్ప శత్రువైనా సరే వచ్చి వేడుకుంటే వాడివల్ల తనకెంత ద్రోహం జరిగినా వెనుకటి విషయాల నన్నింటిని మరచి రక్షిస్తాడు. రాముడు శరణువేడిన వారిని ఎవరెవరిని రక్షించింది తెలుపుతూ ఆ రక్షించింది దేనితో సమానమైందని తెలియజేస్తూ ఆయన శరణాగతరక్షణమనే గుణం యొక్క మహాత్మ్యాన్ని తెలియజేస్తున్నాడు అన్నమయ్య.

రాగము : శ్రీరాగము

పల్లవి : పాటించి నమ్మిన వారి భాగ్యముగాదా
కోటిసుద్దుల యిదె కోరి చేకొనేది ॥పాటిం ॥

**17**

1. స్వామిద్రోహియైన చండి రావణాసురుఁడు
కామించి శరణంటేను కాచేనంటిని
యేమని నీదయ యెంతు నెంతని నీమహిమెంతు
ఆ మాటకు సరియౌనఖిలవేదములు ॥ పాటిం ॥

2. దావతి సీతా ద్రోహము దలఁచి కాకాసురుడు
కావుమని శరణంటే ఁగాచితివి
యీవల నీ శరణనే ఇందు సరే తపము ॥ పాటిం ॥

3. చిక్కు లన్నీ నిఁకనేల చేరి యేపాటి వాఁడైన
గక్కన నీ శరణంటే ఁగాతువు నీవు
అక్కరతో నిన్ను శరణంటిమి శ్రీవేంకటేశ !
యెక్కువ నీ బిరుదుకు యీడా పుణ్యములు ॥ పాటిం ॥

అ.అ.సం.సం.3.88

కోటి సూక్తులచే ఇవే కోరి చేకొనేది. పాటించి నమ్మిన వారి భాగ్యము ఇదేకదా ! అని శ్రీరాముని "శరణాగత రక్షణం" అనే గుణాన్ని పల్లవిలో తెలియజేస్తున్నాడు.

స్వామిద్రోహి అయినటువంటి భయంకర రావణుడు కోరిశరణు అంటే రక్షిస్తానన్నావు. నీదయాగుణాన్ని ఏమని భావించేది. నీ మహిమనేమని భావించేది. శరణంటే రక్షిస్తాననే ఈ మాట సకల వేదాలతో సమానం.

కాకాసురుడు సీతకు చేసిన ద్రోహాన్ని తెలుసుకొనికూడా రక్షించుమని కోరితే ఆయన్ను రక్షించినావు. ఆ తర్వాత చేసిన నీ కార్యము ప్రశంసనీయం. నీమన్నన కూడా అలాంటిదే. నీవు చేసే ఈ శరణాగతరక్షణమే ఎంతో తపస్సుతో సమానమైనట్టిది.

ఇక దిగులెందుకు ? "ఎలాంటి వారినైనా ఆయన శరణంటే చాలు రక్షిస్తావు" నీవు. మేమూ ఆవసరము కొద్దీ నిన్ను శరణువేడినాము. ఎంతైనా నీ గౌర వానికి సాటి వచ్చేవా ఈ పుణ్యాలు.

## భక్తుల విన్నపాలు

శ్రీరాముడు శరణన్నవారిని రక్షించేవాడు. "రిపూణామపి వత్సలః" శత్రువులపై కూడా వాత్సల్యాన్ని చూపేవాడు అని ఖ్యాతిపొందిన వాడీయన. ఈ విషయాలనే అన్నమయ్య శ్రీరాముని రూపంలో ఉన్న శ్రీవేంకటేశ్వరునికి

తెలుపుతూ ప్రభూ ! ఎన్నో తప్పులు చేసిన శత్రువులను రక్షించే నీవు భాగవతులపై చేసిన మా తప్పులను తొలగించలేవా ! తప్పక తొలగించుస్వామీ !అని వేడుకుంటున్నాడు.

రాగము : బౌళి

పల్లవి : రామా ! దయాపరసీమా ! అయోధ్యాపుర
ధామా ! మాంటి వారి తప్పులు లోఁగొనవే ॥ రామా ॥

# 18

1. అపరాధియైనట్టి యాతని తమ్ముని నే
కృపఁజూపితివి నీవు కింకలు మాని
తపియించి యమ్ము మొన దొరకుఁజిక్కినవాని
నెపానఁగాచి విడిచి నీవాదరించితివి. ॥ రామా ॥

2. సేయరాని ద్రోహము సేసిన పక్షికి నీవు
పాయక అప్పటి నభయ మిచ్చితి
చాయసేసుకొని వుండి స్వామి ద్రోహిఁజెప్పినట్టి
తోయపుటేటెని మంచితోవనే పెట్టితివి (?) ॥ రామా ॥

3. నేరము లెంచవు నీవు నీదయే చూపుదుగాని
బీరపు శరణాగత బిరుద (వు?) నీవు
చేరి నేడు నెలుచుండి శ్రీవేంకటాద్రి మీఁదఁ
గోరిన వరము లెల్లా కొల్ల లొసఁగి తివి ॥ రామా ॥

అ.అ.సం.సం. 3.94.

రామా ! దయాపరసీమా ! అయోధ్యపురధామా ! మావంటి వారు చేసిన తప్పులను నీవు స్వీకరించు స్వామీ !

రావణుడు సీతనపహరించి నందున అపరాధి కింకలు అట్టి అపరాధి తమ్ముడైన విభీషణునిపైన దయజూపినావు. బాణపుమొనకు చిక్కిన వానిని నెపముతో రక్షించి నీవు ఆదరించినావు.

చేయరాని ద్రోహము చేసిన కాకాసురుడనే పక్షి వదలకే అభయ మిచ్చినావు.

(రెండవ పాదం సంశయం)

నేరములు లెక్కించకున్నావు. నీవు శత్రువులపైకూడా దయజూపుతూ ఉన్నావు. శరణాగత బిరుదాంకితుడవు. అలాంటి నీవు ఈ నాడు శ్రీవేంకటాద్రిని చేరి అందు నిలుచుండి భక్తులకు కోరిన వరాల నన్నింటిని కొల్లలూ ఇస్తూ ఉన్నావు.

అపరాధులను లెక్కించకే వారిని అక్కున చేర్చుకుంటున్నావే. మేము భక్తులము మా తప్పులను వెనక్కితీసుకోలేవా ! అని అంటున్నాడు పదకర్త అన్నమయ్య.

## శ్రీరాముని శౌర్యం

"ఒకే బాణం ఒకే పత్ని" అని శ్రీరాముడు లోకంలో ప్రసిద్ధి గాంచాడు. శ్రీరాముని భార్యయైన సీతకు ఎంత ప్రఖ్యాతి ఉందో అంతే ప్రఖ్యాతి రామబాణానికి ఉంది. రామబాణము చాలా అమోఘమైంది. రామబాణపు గొప్పదనాన్ని గూర్చి ఈ సంకీర్తనలో అన్నమయ్య రసవత్తరంగా తెలియజేశాడు.

రాగము : నాట

పల్లవి : బాపు బాపు రాఘవ ! నీ ప్రతాపమేమని చెప్ప
పైపై నీ పేరు విని పారేరు రాకాసులు ॥ బాపు ॥

1. వాలినెత్తురు నీటను వాఁడి పదనిచ్చినమ్ము
కూలిచెనొక్కమాటున ఁగుంభకర్ణుని
యీలకొని మాయామృగ మెమ్ముల నొరసినమ్ము
రాలించెనుత్తర గోపురముపై గొడగులు ॥ బాపు ॥

19

2. తొడికి మింటి తాపలు తుంచి దూప(?) దాఁకినమ్ము.
జడధిమరుదేశాల జలమింకించె
యెడయక కౌశికుని యజ్ఞము గాచినమ్ము
అడరి రావణుని పూర్ణాహుతిగఁజేసెను. ॥ బాపు ॥

3. బెడసి యే పొద్దును నీపిడికిటిలోని యమ్ము
సురల భయముఁబాపి సూటికెక్కెను
ఇరవై శ్రీవేంటాద్రి నిటు రామచంద్రుఁడవై
పరగఁగ నీ యమ్ము పగయెల్ల నీఁగెను ॥ బాపు ॥

బాపురే ! బాపురే ! ఓ రాఘవ ! నీ ప్రతాపం ఏమని చెప్పగలము. పైపైనే నీ పేరు వింటేనే పారిపోగలరు రాక్షసులు.

వాలిని నీవుచంపినావు. వాలి నెత్తురనే నీటిలో మునిగి పదునైంది నీ బాణము. అలాంటి నీ బాణము ఒక్కమారే కుంభకర్ణుని కూల్చింది. నిటారైన నీ బాణం మాయా మృగము మర్మంలో చొచ్చుకుపోయింది. పోతే రావణుని ఉత్తరపు గోపురంపైనున్న గొడుగులు నీ బాణంవల్ల రాలిపడ్డాయి.

ప్రయత్నించి ఆకసమంత ఎత్తున ఉన్న తాటిచెట్లను రాల్చిన బాణము శ్రీరామునిది. ఆ బాణమే మరు దేశాల జలాన్ని ఇంకించింది. ఆ బాణమే రావణుని పూర్ణాహుతిగా చేసింది.

నీ పిడికిటిలోని బాణము వెళ్ళి దేవతల భయాన్ని పోగొట్టి ఖ్యాతికెక్కింది ఇలాంటి బాణాధిపతి రామచంద్రుడు వేంకటాద్రిని చేరి అందరి పగ నంతా తొలగించింది. అధిక పాదాలలో బాణం (అమ్ము) అను పదాన్ని వాడడం ఈ సంకీర్తనలోని ప్రత్యేకత.

పాదం మార్చి పాదంలో అమ్ము అనే ఈ పదాన్ని అంత్యప్రాసాగా ఉపయోగించడం జరిగింది.

## శ్రీరాముని దాసపాలనం

శ్రీరాముని గొప్పదనాన్ని తెలుపుతూ వేంకటేశ్వరుని రూపందోనున్న శ్రీరామా! నిన్ను శరణు వేడుతున్నాను రక్షించ వలసిందని భక్తుల పరంగా తన పరంగా స్వామిని అభ్యర్తిస్తూ ఉన్నాడు పదకర్త.

రాగము : శ్రీరాగము

పల్లవి : శరణు వేఁడెద యజ్ఞసంభవ రామ !
అరసి రక్షించు మమ్ము నయోధ్యారామా ! ॥ శర ॥

1. ధారుణిలో దశరథతనయ రామ !
చేరిన యహల్యను రక్షించిన రామ !
వారిధిబంధన కపివల్లభరామ !
తారకబ్రహ్మమైన సీతాపతి రామ ! ॥ శర ॥

20

2. ఆదిత్యకులాంబుధి మృగాంక రామ ! హర
కోదండభంజనము చేకొనినరామ !
వేదశాస్త్రపురాణాది వినుత రామ !
అదిగొన్న తాటకా సంహార రామ ! ॥ శర ॥

3. రావణుని భంజించిన రాఘవ రామ !
వావిరి విభీషణవరద రామ !
సేవ నలమేల్మంగతో శ్రీవేంకటేశుఁడవై
యీవల దాసుల నెల్లా నేలినట్టి రామా ! ॥ శర ॥

అ.అ.సం.సం. 3 . 155

పుత్రకామేష్టియజ్ఞం ద్వారా పుట్టిన ఓ రామా ! నిన్ను శరణు వేడుతున్నాను. ఓ అయోధ్యా రామ ! వచ్చి మమ్ము రక్షించవలసింది.

భూమండలంలోని దశరథ తనయుడవు. చేరిన అహల్యను రక్షించిన వాడవు. సముద్రానికి ఆనకట్టి కట్టిన వానరులకు అధిపతివి. తారక బ్రహ్మమైన సీతిపతి రామా ! మమ్ము రక్షించవలసింది.

సూర్య కులమనే సముద్రానికి చంద్రుని వంటివాడవు. శివధనుస్సును విరిచిన ట్టి వాడవు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు మొదలైన వాటిచే స్తోత్రం చేయబడినవాడవు. తాటక అనే రాక్షసిని చంపినవాడవు. మమ్ము కాపాడుస్వామి.

రావణుని భంజించిన రాఘవ రామునివి. విభీషణుని రక్షించినివాడవు. అలమేలు మంగసేవతో శ్రీవేంకటేశ్వరునివై ఇక్కడి దాసుల నందరినీ ఏలినట్టివాడవు. స్వామి మిమ్ము శరణువేడుచున్నాం రక్షించవలసింది.

ఇందు ప్రతిపాదం నందును రామా ! అని అంతిమ పదాన్ని చేర్చడం ప్రత్యేకత. ఈ పదంద్వారా శ్రోతల్లో భక్తిభావాలు పెల్లుబుకుతాయనడంలో ఏమాత్రం సంశయం లేదు.

## దాసరిపల్లెశ్రీరాముని వైభవం

దాసరిపల్లెలోనున్న శ్రీసీతా లక్ష్మణ సమేత శ్రీరామభద్రునికి ఉద్దేశించి ఆయన అందాలను హొయలను, ఇంపు సొంపులను వర్ణించి సేవకులైన మమ్ములను సాలించవల్సిందని ఆ శ్రీరామ భద్రుని వేడుకొంటున్నాడు పదకర్త.

రాగం : శంకరాభరణం

పల్లవి : సీతారమణవో శ్రీరామచంద్ర !
దాత లక్ష్మణుఁడవే తగ్గురామచంద్ర ! ॥ సీతా ॥

21

1. చెలువపు సింగారాల శ్రీరామచంద్ర ! నీ
నెలవుల నవ్వుగారీ శ్రీరామచంద్ర !
చెలఁగీ చెక్కులఁగళ శ్రీరామచంద్ర !
మొలచె మోహనము నీమోహమున రామచంద్ర ! ॥ సీతా ॥

2. చిక్కని మురిపెముల శ్రీరామచంద్ర !
చిక్కులేదు పెద్దకొప్పు శ్రీరామచంద్ర !
చిక్కె నీచే మదనుఁడు శ్రీరామచంద్ర !
చొక్కపు నున్నని మేని సొంపు శ్రీరామచంద్ర ! ॥ సీతా ॥

3. చేవదేరిన సిగ్గుల శ్రీరామచంద్ర !
శ్రీవేంకటాద్రి మీఁది శ్రీరామచంద్ర !
యీవల దాసరి పల్లెనిరవుకొని మీ
సేవకుల మమ్మునేలే శ్రీరామచంద్ర ! ॥ సీతా ॥

అ.అ. సం.సం. 3.157

సీతకు ఆనందాన్ని కల్గించే ఓరామచంద్రా ! దాత అయిన లక్ష్మణుడే నీకు తగినసేవకుడు.

అందమైన సింగారాలొలికింపజేసే రామభద్ర ! మామా నివాసాలలో నవ్వులు గారించే శ్రీరామభద్రా ! ఉత్సాహంతో చెంపలపై కళలను నింపే రామచంద్రా ! నీ ముఖంపై మోహనాకారం పొడసూపింది.

దట్టమైన మురిపాలతో కూడిన రామచంద్రా ! చిక్కులేని పెద్ద కొప్పుకల్గినవాడా ! మదనుడు నీచేతికి చిక్కినాడు. అందమైన నున్నని శరీరంతో సొంపుగా నున్నావు.

చేవదేరిన సిగ్గులతో శ్రీవేంకటాద్రిమీద వెలసినావు. అక్కడి నుండి దాసరిపల్లెను నివాసంగా చేసుకొని సేవకులైన మమ్ములను ఏలుతూ ఉన్నావు. అట్టి నీకు లక్ష్మణుడు దాతయై సేవచేస్తున్నాడు.

సంకీర్తనలోని ప్రతిపాదం చివర "శ్రీరామచంద్ర !" అనే సంబోధన పదాన్ని ఉంచి శ్రీరామున్ని మాటికి మాటికి సంబోధించి తనే ప్రత్యేకంగా ఆయనతో మాట్లాడుతున్నట్లు అనుభూతి నొందినాడు అన్నమయ్య.

## శ్రీరాముని గొప్పదనం

శ్రీరామునికి చెందిన ఈ సంకీర్తనలో ఆయన సౌందర్యాన్ని భక్త. మిత్ర సోదర సాన్నిహిత్యాన్ని ఇంకా ఇతర విషయాలను చక్కగా తెలియజేయడం జరిగింది.

రాగము : రామక్రియ

పల్లవి: రాముఁడు లోకాభిరాముఁడు
ఆముక విజనగరమందు నున్నవాఁడు ॥ రాముఁ ॥

1. చక్కఁదనముల వాఁడు జానకీవల్లభుఁడు
గక్కన శబరి పూజ గైకొన్నవాఁడు
వెక్కసమైన పైఁడి విల్లునమ్ముల వాఁడు
రక్కసుల వైరి దశరథనందనుఁడు ॥ రాముఁ ॥

22

2. శరధిగట్టినవాఁడు చాయనల్లనివాఁడు
యిరవై సుగ్రీవాదుల నేలినవాఁడు
సరి భరతశత్రుఘ్నసౌమిత్రి సేవితుడు
ఆరిది మునులకభయ మిచ్చినవాఁడు ॥ రాముఁ ॥

3. అట్టె కౌసల్యాత్మజుఁడు అయోధ్యాపతైనవాఁడు
వొట్టి తారక బ్రహ్మమై వుండేటివాఁడు
గుట్టుతో వరము లిచ్చే కోనేటి దండవాఁడు
పట్టపు శ్రీవేంకటాద్రి ఁజరిగిన వాఁడు ॥ రాముఁ ॥

అ.అ.సం.సం. 3.232

శ్రీరాముడు లోకాభిరాముడు. ఈయన విజయనగరం నందున్నట్టి వాడు.

జానకీవల్లభుడైన శ్రీరాముడు మంచి అవయవ సౌష్టవము గలవాడు. శబరి పూజగ్రహించినవాడు. ప్రకాశించు బంగారు విల్లంబులగలవాడు. రాక్షసులకు శత్రువు ఈ దశరథుని కుమారుడు.

సముద్రానికి ఆనకట్టకట్టినవాడు. ప్రేమమీర సుగ్రీవుడు మొదలైన వానరవీరులను ఏలినవాడు. భరత శత్రుఘ్న లక్ష్మణులతో సమంగా సేవించబడినవాడు. మునులను సమీపించి వారికి అభయ మిచ్చినట్టివాడు.

అదే విధంగా కౌసల్య కుమారుడు, అయోధ్యాధిపతియైన శ్రీరాముడు తారకబ్రహ్మం. రహస్యంగా వరాలిచ్చే కోనేటిని దండగా కల్గినట్టివాడు. శ్రీవేంకటాద్రిని పట్టాగా కల్గినట్టివాడు.

ఈ సంకీర్తనలో అంతిమ పదాలు ప్రథమావిభక్తికి చెందినవిగా ఉండడమే విశేషం.

## శ్రీరాముని కటాక్షాలు

శ్రీరామునికి జేజేలు పలుకుతూ ఆయన సాధించిన అనేక ఘనకార్యాలను ఇందు చక్కగా అలతి అలతి పదాలతో రమణీయంగా వివరించడం జరిగింది. ప్రతి వాక్యంలో వివిధ రీతులతో శ్రీరామున్ని సంబోధించడం జరిగింది.

# 23

రాగము : గుండక్రియ

పల్లవి : జయ జయ రామా ! సమర విజయరామా !
భయహర నిజభక్త పారీణ రామా ! ॥ జయ ॥

1. జలధి బంధించిన సౌమిత్రి రామా !
సెలవిల్లువిరిచిన సీతారామా !
అల సుగ్రీవు నేలిన అయోధ్యారామా !
కలిగి యజ్ఞము గాచే కౌసల్యారామా ! ॥ జయ ॥

2. అరి రావణాంతక ఆదిత్యకులరామా !
గురు మౌనులనుఁ గాచే కోదండరామా !
ధర నహల్య పాలిటి దశరథరామా !
హరురాణి నుతులలోకాభిరామా ! ॥ జయ ॥

3. అతి ప్రతాపముల మాయామృగాంతక రామా
సుత కుశలవ ప్రియ సుగుణరామా !
వితత మహిమల శ్రీవేంకటాద్రి రామా !
మతిలోన బాయని మనువంశరామా ! ॥ జయ ॥

అ .అ.సం.సం. 3 . 300

ఓ రామా ! యుద్ధంలో విజయాన్ని సంపాదించే రామా ! భయాన్ని పోగొట్టేవాడా ! నిజభక్తపారీణా ! నీకు జయం జయం అని జయ జయ ధ్వానాలు చేయడం జరుగుతూ ఉంది.

స్వామి ! నీవు సముద్రాన్ని బంధించిన సౌమిత్రి రామునివి. శివధనుస్సును విరిచిన సీతారామునివి. సుగ్రీవుని ఏలిన అలనాటి అయోధ్యారామునివి. విశ్వామిత్రుని యజ్ఞాన్ని గాచిన కౌసల్యారామునివి.

శత్రువైన రావణున్ని చంపినట్టి ఆదిత్యకుల రామునివి. గొప్పనైన మునులను కాపాడే కోదండరామునివి. భూమండలంలో అహల్యకు శాపవిముక్తిని కల్గించిన దశరథరామునివి. ఈశ్వరుని రాణియైన పార్వతితో స్తోత్రములందుకున్న లోకాభిరామునివి.

మిక్కిలి ప్రతాపాలతో మాయలేడిని చంపిన రామునివి. నీ కొడుకులైన కుశలవులకు ఇష్టమైన సుగుణాల రామునివి. అంతటా వ్యాపించిన మహిమలు కల్గినట్టి వేంకటాద్రిరామునివి. బుద్ధిలోన ఎప్పటికీ పాయని మనువంశ రామునివి. ఇలాంటి రాముడైన నీకు జేజేలు స్వామి! అలనాటి రామునివైన నీవు ఈనాడు వేంకటేశ్వరునిగా ఖ్యాతి పొందుతూ ఉన్నావు.

అంతిమపదం సంబోధన ప్రథమావిభక్తి ఏకవచనంగా ఉండడం ఇందలి ప్రత్యేకత.

## శ్రీరామనామాలు

శ్రీరాముని పేరే చాలా గొప్పనైనది. ఈ నామమే పరమ యోగులకు మోక్షాన్నిచ్చేది. 'రా' అంటే శరీరంలోనుండి పాపాలు తొలగిపోతాయి. 'మ' అంటే తొలగిపోయిన పాపాలను తిరిగి దేహంలోనికి రానివ్వరు. రామనామం కోరిన కోర్కెలనన్నింటిని యిచ్చేదని అన్నమయ్య ఈ సంకీర్తన ద్వారా తెలియజేస్తూ ఉన్నాడు.

రాగము : పాడి

పల్లవి : రామభద్ర ! రఘువీర ! రవివంశతిలక ! నీ
నామమే కామధేనువు నమో నమో ॥ రామ ॥

1. కౌసల్యానందవర్ధన ! ఘన దశరథ సుత !
భాసుర యజ్ఞరక్షక ! భరతాగ్రజ !
రాసికెక్కు (క్క) కోదండ రచన విద్యాగురువ
వాసితో సురలు నినువడి మెచ్చేరయ్యా ! ॥ రామ ॥

24

2. మారీచ సుబాహుమర్దన తాటకాంతక !
దారుణ వీరశేఖర ! ధర్మపాలక !
కారుణ్యరత్నాకర ! కాకాసురవరద !
సారెకు వేదవిదులు జయవెట్టేరయ్యా ! ॥ రామ ॥

3. సీతారమణ ! రాజశేఖర శిరోమణి
భూతలపుటయోధ్యాపుర నిలయా !
యీతల వేంకటాద్రి నిరవయిన రాఘవ !
ఘాత నీప్రతాపమెల్లాఁగడు నిండెనయ్యా ! ॥ రామ ॥

అ.అ.సం.సం. 3.304

ఓ రామభద్రుడా ! రఘువంశవీరుడా ! సూర్యవంశానికే తిలకం వంటివాడా ! నీ పేరే కామధేనువులాగా కోరిన కోర్కెలను తీర్చేది. అలాంటి రామా ! నీకు నమస్కారం నమస్కారం.

కౌసల్యకు ఆనందాన్ని అధికంగా కలుగజేసేవాడా ! గొప్పదైన దశరథునికి కుమారుడా ! ప్రకాశించే యజ్ఞాన్ని రక్షించేవాడా ! భరతునికి సోదరా ! పేరుగాంచిన విలువిద్యగురువా ! వాసితో దేవతలు నిన్ను వడిగా మెచ్చుకోగలరు.

తాటక మారీచ సుబాహువులనే రాక్షసులను చంపినవాడా ! దారుణవీరశేఖరుడా ! ధర్మాన్ని పాలించువాడా ! దయాసముద్రుడా ! కాకాసురున్ని కాపాడినవాడా ! పూజాసామాగ్రితో వేదవిద్వాంసులు నీకు జేజేలు పలుకు తున్నారయ్యా. అందుకో మా నమస్కారం.

సీతకు ఆనందాన్ని కల్గించేవాడా ! రాజశ్రేష్ఠులకు తలమానిక మైనటువంటివాడా ! భూతలపు అయోధ్యాపురంలో నివసించేవాడా ! ఇక్కడ వేంకటాద్రిపై కొలువున్న ఓ రాఘవా ! నీ ప్రతాపమెల్లా మిక్కిలి తేజోవంతమై అంతా నిండినదికదా స్వామి ! నీ పేరే కామధేనువులాగా కోరిన కోర్కెలనిచ్చేది కదా ! నీకు మాటిమాటికి నమస్కారం స్వామి ! అని అంటున్నాడు అన్నమయ్య.

## శ్రీరామునికి నివేదన

శ్రీరాముని రాజసాన్నిగాంచి నారదుడెలా ప్రేమతో ఉన్నాడు ? రంభమొదలైనవారు ఎలా నాట్యమాడినారు? వానరులేమి చేస్తున్నారు ? అనే అంశాలను ఇందు తెలియజేయడం జరిగింది.

## 25

రాగము : లలిత

పల్లవి : అవధారు రఘుపతి యందరిని చిత్తగించు
యివల నిండెఁ గొలువిదె నడె సముభా ॥ అవ ॥

1. రామ ! రాఘవ! రామభద్ర ! రామచంద్ర !
శ్రీమదయోధ్యాపతి సీతాపతి
ప్రేమ నారదుఁడు వాఁడీ బెక్కు రంభాదులాడేలాడేరు
మోమత్తి కపులెల్ల మొక్కేరదివో ॥ అవ ॥

2. యినవంశకుల జాత ఇక్ష్వాకు తిలకా !
ఘనదశరథసుత కౌశికప్రియ
మునులు దీవించేరు ముందట భరతుఁడదె
వెనకల లక్ష్మణుఁడు సేవించే వింజామర ॥ అవ ॥

3. కందువఁ గౌసల్యాగర్భ రత్నాకర !
చెందిన శ్రీవేంకటాద్రి శ్రీనివాసా !
సందడిఁ గువలవులు చదివేరు నొకవంక
చెంది నీరాజనము చెప్పరాదు రామా ! ॥ అవ ॥

అ.అ.సం.సం. 3.492

రఘువంశం వారికి నాథుడవైన రామా ! మేము చెప్పేది ఆలకించండి. అందరిని చిత్తగించండి. ఇదిగో ఇక్కడ కొలువు ఏర్పాటు చేయబడింది. సుందరము ఖగల స్వామి ! నడువండి.

రామా ! రఘువంశానికి చెందినవాడా ? రామభద్రా ! రామచంద్రా ! సంపన్నమైన అయోధ్యానాథా ! సీతాదేవికి పతివినీవు. అదుగో ! నారదుడు ప్రేమతో పాడుతున్నాడు. రంభమొదలైన అప్సరసలు నాట్యం చేస్తూ ఉన్నారు. వానరులంతా నీకు మొక్కుతూ ఉన్నారు.

సూర్యవంశంలో పుట్టిన వాడా ! ఇక్ష్వాకు కులానికి తిలకం వంటి వాడా ! గొప్పనైన దశరథకుమారా ! విశ్వామిత్రునికి ఇష్టమైన వాడా ! అదిగో ! మునులు నిన్ను దీవిస్తూ ఉన్నారు. నీ ముందు భరతున్నాడు. వెనుక లక్ష్మణుడు వింజామరతో వీస్తూ ఉన్నాడు.

కౌసల్యాగర్భ రత్నాకరా ! శ్రీవేంకటాద్రికి చెందిన శ్రీనివాసా ! సందడిలో కుశలవులు ఒక ప్రక్క రామాయణాన్ని చదువుతూ ఉన్నారు. ఓ రామా ! నీ రాజసాన్ని గూర్చిమేము చెప్పలేకున్నాం సుమా ! అని అంటున్నాడు అన్నమయ్య.

## గుత్తిశ్రీరాముని వైభవం

తీర్థయాత్రానెపంతో నేటి అనంతపురం జిల్లా గుత్తిలో వెలసిన రఘురామున్ని అన్నమయ్య సందర్శిచడం జరిగింది. ఆ స్వామిని చూచినవెంటనే ఆ స్వామి స్వరూపాన్ని ఇలా సంకీర్తనలో తెలియజేశాడు.

రాగము : పాడి

పల్లవి : సౌమిత్రి సహోదర ! దశరథరామా !
చేముంచి గుత్తిలో వెలిసిన రఘురామా ! ॥ సౌమి ॥

26

1. చెలిమి సుగ్రీవుతోడఁ జేసిన రామ తొల్లి
శిలనుఁ బడఁగిఁ గావించిన రామా !
చెలరేఁగిన వానర సేనల రామా !
శిలుగు మాయామృగముఁ జించిన రామా ! ॥ సౌమి ॥

2. తరణి వంశ తాటకాంతక రామా !
నరనాథ కౌసల్యానందన రామా !
సిరుల ఁబెండ్లాడిన సీతారామా !
గరిమతో సేతువు గట్టిన రామా ! ॥ సౌమి ॥

3. రావణాదిదనుజహరణరామా !
కావించి విభీషణునిఁగాచిన రామా !
దీవెనల యోధ్యలో ఁజెందిన రామా !
శ్రీవేంకటాద్రి మీఁది శ్రీరామా ! ॥ సౌమి ॥

అ.అ.సం.సం. 3. 499

లక్ష్మణుని సహోదరునివైన ఓ దశరథరామా ! గుత్తిలో వెలసిన రఘురామా ! నీ సౌందర్యాన్ని ఏమని వర్ణించేది.

త్రేతాయుగంలో సుగ్రీవునితో స్నేహం చేసిన రామునివి. బండరాతినిస్త్రీగా (అహల్యగా) మార్చిన రామునివి. వానర సేనలతో చెలరేగిన రామునివి. బంగారు కాంతులతో ప్రకాశించే మాయలేడిని చంపిన రామునివి.

సూర్యవంశమున పుట్టి తాటకి అనే రాక్షసిని చంపిన రామునివి. నరులకు నాథునివి. కౌసల్యకు ఆనందాన్ని కల్గించే రామునివి. సంపదలతో సీతను పెండ్లాడిన వాడివి. గొప్పదనంతో సముద్రానికి సేతువును కట్టించినట్టి రామునివి.

రావణుడు మొదలైన రాక్షసులను చంపినట్టి, విభీషణుని రక్షించునట్టి, అయోధ్యలలో దీవనలతను అందు శ్రీవేంకటపర్వతంపై వేంకటేశ్వరుని రూపంలో ఉన్న ఓ శ్రీరామా ! నీ సౌందర్యాన్ని ఏమని తెలిపేది.

## శ్రీరామునికీర్తిచంద్రికలు

శ్రీరామచంద్రుడు నరులకు ఇంద్రుడు. ఆయనను శరణువేడుతూ మమ్ము రక్షించవలసిందని అన్నమయ్య ప్రార్థిస్తూ ఉన్నాడు. ఈ విధంగా ప్రార్థిస్తూ ఆయనలోని గొప్పదనాన్ని రామాయణ కథాధారంగా తెలియజేస్తూన్నాడు.

రాగము : శ్రీరాగము

పల్లవి : శరణు శరణు రామచంద్ర ! నరేంద్రా !
సరి మమ్ముఁగావు రామచంద్ర నరేంద్రా ! ॥ శర ॥

**27**

1. ఘన దశరథునకుఁ గౌసల్యాదేవికిని
జననమందిన రామచంద్ర నరేంద్రా !
కోపించి తాటకిఁజంపి కౌశికు జన్నముఁగాచి
చనవులిచ్చిన రామచంద్ర నరేంద్రా ! ॥ శర ॥

2. అపూర్వమైన సీతఁబెండ్లాడి అభయ మందరికిచ్చి
శరధిఁగట్టిన రామచంద్ర నరేంద్ర !
అరసిరావణుఁజంపి అయోధ్యానగరమేలి
సరవి నేలిన రామచంద్ర నరేంద్ర ! ॥ శర ॥

3. పన్నుగ నలమేల్మంగపతి నరేంద్ర !
పన్నిధినిల్చిన రామచంద్ర నరేంద్ర !
అన్నిటా లక్ష్మణభరతాంజనేయ శత్రుఘ్నుల
సన్నుతి కెక్కిన రామచంద్ర నరేంద్ర ! ॥ శర ॥

అ.అ.సం.సం. 3.505

నరేంద్రా ! రామచంద్రా ! నిన్ను శరణు శరణు అని వేడుకొంటున్నాను. నీవు నన్ను కాపాడవలసింది.

స్వామీ ! నీవు గొప్పవైన దశరథునికి కౌసల్యాదేవికిని జన్మించినట్టివాడవు. కోపించిన తాటకిని చంపి విశ్వామిత్రుని యజ్ఞాన్ని కాపాడినట్టి. రామచంద్ర నరేంద్రునివి.

అలమేలు మంగకు భర్తయైన శ్రీవేంకటేశ్వరునిగా శ్రీవేంకటేశ్వరునివి. లక్ష్మణ భరత ఆంజనేయ శత్రుఘ్నుల చేమిక్కిలి స్తోత్రములందు కొన్న రామచంద్ర నరేంద్రునివి. ఇన్ని విధాల కీర్తికెక్కిన వాడివి. ఇలాంటి నిన్ను మేము శరణుపొందుతున్నాం. మమ్ములను రక్షించవలసిందింగా కోరుచున్నాం.

ఈ సంకీర్తనలో "రామచంద్ర !" "నరేంద్ర !" అనే పదాలను వాక్యాంతాలలో ఉంచడం గమనించదగినది.

## శ్రీరాముని గొప్పదనాలు

సీతానమేతుడైన శ్రీరాముని స్మరిస్తూ ఆయనగొప్పదనాలను తెలియజేస్తూ పదకర్త ఆయనను స్తోత్రం చేస్తున్నాడీ సంకీర్తనలో.

రాగము: సాళంగనాట

పల్లవి : సీతాసమేత రామ ! శ్రీరామ !
రాతి నాతిఁజేసిన శ్రీరామ ! రామ ! ॥ సీతా ॥

# 28

1. ఆదిత్యకులమునందు నవతరించిన రామ !
కోదండ భంజన రఘుకులరామ !
అదరించి విశ్వామిత్రుడు యాగముగాచిన రామ!
వేదవేదాంతములలో వెలిసిన రామ ! ॥ సీతా ॥

2. బలిమి సుగ్రీవుని పాలి నిధానమ రామ !
యిల మునులక భయమిచ్చిన రామ !
జలధి నమ్ము మొనను సాధించిన రామ !
అలరు రావణదర్ప హరణ రామ ! ॥ సీతా ॥

3. లాలించి లంకయేలించి న రామ !
చాలి శరణాగత రక్షక రామ !
మేలిమి శ్రీవేంకటాద్రి మీఁద వెలసిన రామ !
తాలిమిఁతో వెలయు ప్రతాపపురామ ! ॥ సీతా ॥

అ.అ.సం.సం. 3. 516

సీతతో కూడుకున్న ఓ రామా ! శ్రీరామా ! రాయిని స్త్రీగా మార్చినావే. ఇది అద్భుతమైన కార్యమే అని ప్రశంస.

సూర్యుని కులంలో పుట్టిన రామునివి. శివధనుస్సును విరిచిన రఘువంశ రామునివి. రాక్షసులను భయపెట్టి విశ్వామిత్రుని యాగాన్ని రక్షించిన రామునివి. వేదవేదాంతాలలో వెలిసినట్టి రామునివి.

బలవంతుడైన సుగ్రీవుని పాలిటి నీవు పెన్నిధివి. ఈ లోకంలోని మునులకు అభయ మిచ్చిన వానివి. సముద్రాన్ని అమ్ముమొనతో దారిలోకి తెచ్చుకున్నవానివి. ప్రకాశించువాడవై రావణుని పొగరు అణచినట్టి వానివి.

విభీషణుని లాలించి లంకను ఏలించిన రామునివి. శరణాగతరక్షణానికి తగినట్టి రామునివి. స్వచ్ఛమైన వేంకటాద్రిమీద వేంకటేశ్వరునిగా వెలసినట్టి శ్రీరామునివి. నిలకడలో ప్రకాశించునట్టి ప్రతాపరామునివి. అలాంటినీవు సీతాసమేతుడవు. రాయిని స్త్రీగా చేయడంలో ఆశ్చర్యమేమి ఉంది.

## శ్రీరాముని భిన్న నామాలు

ఈ సంకీర్తనలో అంతటా రామున్ని గూర్చియే సంబోధన చేయడం జరిగింది.

రాగము : బౌళి

పల్లవి : నమోనమో దశరథనందన రామ !
కమనియ్యా యాగభాగకర్త రామ ! ॥ నమో ॥

29

1. కాకుత్థ్సకుల రామ ! కౌసల్యాసుత రామ !
శ్రీకరగుణోన్నత ! శ్రీరామ !
కాకాసురవైరి రామ ! కౌశికవత్సల రామ !
భీకర తాటకాంతక ! బిరుదరామ ॥ నమో ॥

2. వారధి బంధన రామ ! వాలి హరణరామ !
చారుహరకోదండ భంజన రామ !
ధారుణిజపతి రామ! దశకంఠహర !
సారవిభీషణాధి షేచన రామ ! ॥ నమో ॥

3. అమరపాలిత రామ ! అయోధ్యాధిపతి రామ !
సమరకోవిదరామ ! సర్వజ్ఞ ! రామ !
విమల రామ ! శ్రీవేంకటగిరి రామ !
రమణ శరణాగతరక్షక ! రామ ! ॥ నమో ॥

అ.అ.సం.సం. 10.144

దశరథుని కుమారుడైన రామా ! కమనీయమైన యాగభాగకర్తవైనరామా ! నీకు నమస్కారం, నమస్కారం.

నీవు కకుత్థ్సుడనే వారి వంశంలో జన్మించిన వాడివి కౌసల్య కుమారునివి: శ్రీకరునివి. గుణోన్నతునివి. కాకాసురుని శత్రువువు. విశ్వామిత్రవత్సలుడవు. భయంకరమైన తాటకి అనే రాక్షసిని చంపినవాడివి. రాముడనే బిరుదం కల్గి నట్టివాడవు. ఇట్టిగుణగణాలను కల్గినట్టిరామా ! నీకు నమస్కారమని భావం.

నీవు సముద్రానికి ఆనకట్టను కట్టినవాడివి. వాలిని చంపిన వాడివి. అందమైన శివుని విల్లును విరిచినట్టి వాడవు. భూమాతకు పుట్టిన-సీతకు భర్తవు. రావణుని పదితలలను నరికిన వాడివి. సారభూతుడైన విభీషణున్ని అభిషేకించినవాడవు. ఇట్టి నైపుణ్యాలను గల్గినట్టి శ్రీరామా ! నీకు నమస్కారమని భావం.

నీవు దేవతలను పాలించిన వాడివి. అయోధ్యకు అధిపతివి. యుద్ధంలో కోవిదునివి. అన్నియును తెలిసినవానివి. మాలిన్యం లేనట్టివాడివి. శ్రీవేంకటగిరి రామునివి. రమణునివి. శరణాగతరక్షకునివి. నీకు నమస్కారం నమస్కారం అని ఇరువాలు చెప్పు చున్నాడు. ఈ సంకీర్తనలో ప్రతిపాదంలోను రెండుసార్లు రామున్ని సంబోధించడం జరిగింది.

## భక్తుల భావనలహరిలో రాముడు

ఎవరు ఏ విధంగా భావించుకుంటే వారిని ఆ విధంగా ఉంటాడు శ్రీరాముడు. ఈ స్వామి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా మేలుచేకూర్చినట్టివాడు. ఎవరెవరికి ఏ ఏ మేలు చేకూర్చినాడో ఈ సంకీర్తనలో వివరించడమైంది.

రాగము : శ్రీరాగము

30

పల్లవి : రామచంద్రుఁడితఁడు రఘువీరుఁడు
కామితఫలము లియ్యఁగలిగె నిందరికి ॥ రామ ॥

1. గౌతము భార్యపాలిటి కామధేనువితఁడు
ఘాతలఁగౌశికుపాలి కల్పవృక్షము
సీతాదేవి పాలిటి చింతామణీతఁడు
యీతఁడు దాసుల పాలి యిహపర దైవము ॥ రామ ॥

2. పరగ సుగ్రీవుపాలి పరమబంధుఁ డితఁడు
సరి హనుమంతుపాలి సామ్రాజ్యము
నిరతి విభీషణుపాలి నిధానము
గరిమ జనకుపాలి ఘనపారిజాతము ॥ రామ ॥

3. తలడప శబరి పాలి తత్వపుర రహస్యము
అలరి గుహుని పాలి ఆదిమూలము
కలఁడన్న వారి పాలి కన్నులెదుటి మూరితి
వెలయ శ్రీవేంకటాద్రి విభుఁడితఁడతు ॥ రామ ॥

అ.అ.సం.సం. 10. 147

ఈయన శ్రీరామచంద్రుడు రఘువంశపు వీరుడు. అందరికి కోరిన కోర్కెలనిచ్చు నట్టివాడు.

ఈ శ్రీరాముడు గౌతమ మహర్షి భార్య అహల్యకు కామధేనువు వంటి వాడు. వీరుడైన విశ్వామిత్రునికి కల్పవృక్షం వంటివాడు. సీతాదేవికి చింతా మణివంటివాడు. సేవకుల ఈ లోకపుదైవం శ్రీరాముడు.

పరిశీలించినట్లైతే ఈ శ్రీరాముడు సుగ్రీవునికి ఈ లోకపు బంధువు. హనుమంతునికి తగినట్టి సామ్రాజ్యం వంటివాడు. విభీషణునికి విశేషమైన ఆశ్రయం వంటివాడు. జనకునికి గొప్పనైన పారిజాతం వంటివాడు.

భావింప శబరికి తత్వపు రహస్యం వంటివాడు. గుహునికి మొదటిమూలం. ఉన్నాడనుకునే ఆస్తికులకు కన్నుల ముందటి విగ్రహం. ఇలాంటి శ్రీరాముడు శ్రీవేంకటాద్రి నాథుడై ప్రకాశిస్తూ అందరికోర్కెలను తీర్చుతూ ఉన్నాడు.

## శ్రీరాముని దివ్యగుణాలు

ఈ సంకీర్తనలో రామభద్రుని దివ్యగుణాలు కమనీయంగా వివరించబడినాయి. రామాయణంలోని దివ్యగాథలను రామునికి విశేషణములుగా వాడి రాముని గొప్పదనాన్ని భక్తులకు తేట తెల్లం జేస్తున్నాడీ సంకీర్తనలో.

రాగము : పాడి

పల్లవి : రామా ! దశరథరామా నిజసత్య
కామా ! నమో నమో కాకుత్థ్స రామా ! ॥ రామా ! ॥

# 31

1. కరుణానిధి రామ కౌసల్యానందన రామ!
పరమపురుష సీతాపతిరామ !
శరధిబంధన ! రామ ! సవన రక్షక రామ !
గురుతర రవివంశ కోదండరామ ! ॥ రామా! ॥

2. దనుజహరణ రామ ! దశరథసుత రామ !
విను (న?) తామరస్తోత్ర విజయరామ !
మనుజావతార రామ మహన్యగుణ రామ !
అనిలజప్రియ రామ ! అయోధ్యారామ ! ॥ రామా ! ॥

3. సులలిత యశ ! రామ ! సుగ్రీవ వరద రామ !
కలుషరావణభయంకర ! రామ !
విలసిత రఘురామ వేదగోచర రామ !
కలిత ప్రతాప ! శ్రీవేంకటగిరిరామ ! ॥ రామా ! ॥

అ.అ.సం.సం. 10.156

రామ! దశరథరామ ! నిజసత్యకామ కకుత్థ్సవంశానికి చెందిన రామా ! నీకు నమస్కారం అని పల్లవిలో తెలియజేస్తున్నాడు.

రామ ! నీవు దయకు నిలయమైన వాడవు. కౌసల్యకు సంతోషాన్ని కలిగించే రామునివి. పరమపురుషునివి. సీతకు భర్తవైన రామునివి. సముద్రాన్ని బంధించినట్టి రామునివి. యజ్ఞాన్ని రక్షించినరామునివి. గొప్పనైన సూర్యవంశపు కోదండరామునివి.

రాక్షసులను చంపిన రామునివి. దశరథుని కుమారుడవైన రామునివి. దేవతలచే కీర్తింపబడ్డ విజయరామున్నివి. మానవావతారాన్ని దాల్చిన రామునివి. మహనీయగుణగణాలు కల్గిన రామునివి. వాయువు కుమారునికి ప్రియమైన రామునివి. అయోధ్యా రామునివి.

సులలిత కీర్తిని గల్గినట్టి రామునివి. సుగ్రీవుని కాపాడిన రామునివి. కలుషితుడైన రావణునికి భయాన్ని కల్గించే రామునివి. ప్రకాశించు రఘురామునివి.

వేదాలచే తెలియబడే రామునివి. కలితప్రతాపముగల శ్రీవేంకటగిరి రామునివి. ఇన్ని గుణాలకు నిలయుడవైన రామా ! నీకు నమస్కారం. నమస్కారం అని రెండు మార్లు తెలుపుకుంటున్నాడు. రామా ! అని అరంభంలోనే సంబోధించి ప్రతిపాదానికి చివర అంత్యప్రాసగ రామ ! పదాన్ని ఉంచినాడు. ప్రథమ ద్వితీయ పాదాలతో మధ్యలోకూడా రామపదాన్ని ఉంచడం ఒక ప్రత్యేకత. సంకీర్తన అంతా సంబోధనా ప్రథమ విభక్తిలోనే సాగడం ఇక్కడి విశేషం.

## సంక్షిప్త రామకథ

శ్రీమద్రామాయణపు సారం ఎంతో రమణీయంగా చెప్పబడింది. ఈ సంకీర్తనలో రామకథను ఇంత సులభంగా వాడుకభాషలో అందరికీ తెలిసే విధంగా 7కాండల కథను 8పాదాలలో చెప్పడం అన్నమయ్యకు తప్ప మరొకరికిసాధ్యం కాదేమోనని తెలుస్తూ ఉంది. సంక్షిప్తరచనకు మారుపేరు అన్నమయ్య.

రాగము : బౌళి

పల్లవి : ఇతఁడు తారకబ్రహ్మమీతఁడు సర్వేశ్వరితఁడు
రతికెక్కఁగెలిచిన రక్షించునితఁడు ॥ ఇతఁ ॥

32

1. తరణివంశజుఁడై తాటకను హరియించి
అరుదుగ విశ్వామిత్రు యాగము గాచి
హరుని విల్లు విరిచి యట్టె సీతఁ బెండ్లి యాడి
పరశురాముని నిజబలిమి చేకొనెను ॥ ఇతఁ ॥

2. మునుల కభయమిచ్చి మొగినసురులఁద్రుంచి
ఘనమైన మాయామృగము ఁజంపి
కినిసి వాలిఁగొట్టి సుగ్రీవుని ఁబట్టము గట్టి
వనధి బంధించి లంక వడిఁ జుట్టు ముట్టెను ॥ ఇతఁ ॥

3. బలు రావణునిఁజంపి పుష్పకముపై దాఁజేకొని
లలి విభీషణునకు లంకయిచ్చి
చెలఁగియయోధ్య యేలి శ్రీవేంకటాద్రి మీఁద
వెలయ రాముడు దానై విశ్వమెల్లానేలెను ॥ ఇతఁ ॥
అ.అ.సం.సం. 10 . 159

ఈ శ్రీరాముడే తారకబ్రహ్మ. సర్వేశ్వరుడు. రతికెక్క గెలిచిన రక్షించేవాడు.

సూర్యవంశానికి చెందినవాడై, తాటకను చంపి, విశ్వామిత్రుని యజ్ఞాన్ని రక్షించి. శివధనుస్సును విరిచి, సీతను పెండ్లాడి పరశురాముని నిజబలాన్ని గ్రహించినాడు.

మునులకు అభయాన్నిచ్చి, రాక్షసులను చంపి, గొప్పనైన మాయామృగాన్ని చంపి, కోపించి వాలిని చంపి సుగ్రీవునికి పట్టాభిషేకం చేసి, సముద్రానికి ఆనకట్ట కట్టి లంకను చుట్టుముట్టినాడు.

రావణున్ని చంపి, పుష్పక విమానాన్ని స్వీకరించి ప్రేమతో విభీషణునికి లంకా పట్టాభిషేకం చేసి, విజృంభించి అయోధ్యారాజ్యాన్ని ఏలి ఆ తర్వాత శ్రీవేంకటాద్రి పర్వతంపై ప్రకాశించి అంతా తానే అయి విశ్వమంతా ఏలినాడు.

## శ్రీరాముని జన్మ - ఆయన గొప్పదనం

ఈ సంకీర్తనలో శ్రీరాముని జన్మ విధానం, ఆయన సీతకు భర్తయైన విధం, ఆయన గొప్పదనం, భక్తుల గమ్యం, శ్రీవేంకటేశ్వరుని అర్చావతారాన్ని వివరించడం జరిగింది. అన్నింటికీ మూలం వేంకటగిరి శ్రీరామచంద్రుడే అని వేంకటేశ్వరునికి, శ్రీరామచంద్రునికి అభేదం తెలుపుతున్నాడు.

రాగం : పాడి

పల్లవి రాముడు రాఘవుఁడు రవికులు డితఁడు
భూమిజకు పతియైన పురుష విధానము ॥ రాముడు॥

# 33

1. అరయ పుత్ర కామేష్ఠి యందు బరమాన్నమున
పరగ జన్మించిన పరబ్రహ్మము
సురల రక్షింపగ పగ నసురుల శిక్షింపగ
తిరమయి యుదయించిన దివ్యతేజము ॥ రాముడు॥

2. చింతించే యోగీంద్రుల చిత్తసరోజములతో
సంతతము నిలిచిన సాకారము
వింతలుగా మునులెల్ల వెదకిన యట్టి
కాంతుల జెన్ను మీరిన కైవల్యపదము ॥ రాముడు॥

3. వేదవేదాంతముల యందు విజ్ఞానశాస్త్రములందు
పాదుకొనబలికేటి పరమార్థము
పొదితో శ్రీవేంకటాద్రి నిజనగరాన
ఆదికి ననాదియైన అర్చావతారము ॥ రాముడు॥

శ్రీరాముడు రఘుసంతతికి చెందినవాడు. సూర్యవంశంలో పుట్టినవాడు. సీతాదేవికి భర్తయైన పురుష విధానము.

పుత్రకామేష్ఠి యాగంలో పరమాన్నం ద్వారా దశరథ కౌసల్యలకు జన్మించిన పరబ్రహ్మం ఈయన. దేవతలను రక్షించడానికి పగతో రాక్షసులను శిక్షించడానికి స్థిరంగా జన్మించిన దివ్యతేజమే ఈ శ్రీరాముడు.

ఎల్లప్పుడూ ధ్యానించే యోగీంద్రుల హృదయ తామరలనే పువ్వులలో నిలిచిన ఆకారము దాల్చిన రూపము ఆశ్చర్యంతో మునులంతా వెదకినట్టి, కోటి సూర్యకాంతులతో చెన్ను మీరిన కైవల్యపదము ఈ శ్రీరాముడే.

నాలుగువేదాలలోను, వేదాంతశాస్త్రాలలోను, విజ్ఞానశాస్త్రాలలోను పాదుకొని చెప్పబడ్డ భక్తులు చేరుకోవలసిన మోక్షస్థానం ఈయనే.

తన నిజనగరమైన శ్రీవేంకటపర్వతంపై ఆదికి అనాదియైన అర్చావతారం. ఈ రామచంద్రుడే అని అన్నమయ్య పరవశంతో తెలుపుతున్నాడు.

# సంస్కృత సంకీర్తన

శ్రీరాముని ఘనకార్యాలు తెలుపుచూ సంబోధన ప్రథమావిభక్తులతో ఈసంకీర్తన వ్రాయబడింది. సముద్రంపై ఆనకట్టకట్టడం మొదలుకొని బాలకాండ కథ వరకు గల రాముని మహిమలను ఇందు తెలియజేయడం జరిగింది.

రాగము : కన్నడ గౌళ

పల్లవి : శరణు శరణు దేవ సర్వపోషక !
కరుణా నిలయ ! రామకౌసల్య నందన ! ॥ శర ॥

34

1. వారిధిబంధన రావణ శిరశ్ఛేదక !
మారీచ సుబాహు బలమర్దన
దారుణ కుంభకర్ణ దనుజసంహారక
వీర ప్రతాపరామ విజయాభిరామ ॥ శర ॥

2. సవన రక్షక ! మునిజనకులనిర్వాహక !
దివిజవంద్య ! కపిసేనానాయక !
వివిధ సప్తతాళ విధ్వంసన చతుర !
భువనేశ ! సాకేత పురవాస ! రామ ! ॥ శర ॥

3. హరచాప హర ! అహల్యా శాప విమోచక !
ఖరశిలవాలి నిగ్రహబిరుద !
నిరతి శ్రీవేంకటేశ ! నిజభక్తరక్షక !
ధరణిజాసమేత ! దశరథ రామ ! ॥ శర ॥

అ. అ. సం. సం. 10. 170.

దేవ ! అందరినీ పోషించేవాడా ! దయకు నిలయమైన వాడా ! కౌసల్య కుమారుడవైన ఓ రామా ! నిన్ను శరణు వేడుచున్నాను. అనిరెండుమార్లు చెప్పుచున్నాడు.

సముద్రానికి ఆనకట్టకట్టినవాడా ! రావణుని శిరస్సును ఖండించినవాడా ! మారీచసుబాహువుల బలాన్ని మర్దించినవాడా ! దారుణమైన కుంభకర్ణుడనే రాక్షసున్ని చంపినవాడా ! వీర ప్రతాపాలు కలిగిన రామా ! విజయాభిరామ ! నిన్ను శరణువేడుచున్నాను.

విశ్వామిత్రుని యాగాన్ని కాపాడినవాడా ! మునిజన కులాన్ని నిర్వహించినవాడా ! రకరకాలైన ఏడు తాటి చెట్లను నాశనం చేసిన నైపుణ్యం కలిగినవాడా ! లోకాలకు ఈశ్వరుడా ! అయోధ్యలో నివసించిన రామ నిన్ను శరణు వేడుచున్నాను.

శివధనుస్సును విరిచినవాడా ! అహల్యాశాపాన్ని పోగొట్టిన వాడా ! ఖరున్ని వాలిని చంపినట్టి బిరుదు కల్గినట్టివాడా ! శ్రీ వేంకటేశ ! నిజభక్తులను రక్షించినట్టివాడా ! సీతాసమేతుడవైన దశరథరామా ! నిన్ను శరణువేడుచున్నాను కాపాడవలసిందని అన్నమయ్య శ్రీ వేంకటాద్రి రామున్ని ప్రార్థిస్తున్నాడు.

## విజయ నగర రాముని వైభవం

ఈ సంస్కృత సంకీర్తనలో శ్రీరాముడు చేసిన ఘనకార్యాలు పూసగ్రుచ్చినట్లుగా వివరించబడ్డాయి. తాటకను చంపింది మొదలు రావణుని సంహరించి అయోధ్యకు వచ్చేంతవరకు ఆయనదే చేయబడ్డ ప్రధానకార్యాలన్నీ ఇందు వివరించబడ్డాయి.

రాగము: బౌళి

పల్లవి నమో నమో రఘుకుల నాయక దివిజవంద్య
నమో నమో శంకర నగజ (జా?) నుత ॥ నమో ॥

1. విహిత ధర్మపాలక ! వీర దశరథరామ !
గహన వాసినీ తాటకా మర్దన !
అహల్యాశాపమోచన అసురకులభంజన !
సహజ విశ్వామిత్ర ! సవనరక్షకా ! ॥ నమో ॥

35

2. హరకోదండ హర ! సీతాంగనా వల్లభ
ఖరదూషణారి వాలిగర్వాపహా ।
తరణి తనూజాది తరుచర పాలక !
శరధి లంఘన కృత్య సౌమిత్రి సమేత ! ॥ నమో ॥

3. బిరుద రావణ శిరోభేదక ! విభీషణ !
వరద సాకేతపురవాస రాఘవ !
నిరుపమ శ్రీవేంకటనిలయ విజనగర
పురవరవిహార ! పుండరీకాక్ష ! ॥ నమో ॥

అ.అ.సం.సం. 11 . 176

రఘు కులానికి నాయకుడు, దేవతలచే నమస్కరింపబడునట్టి శ్రీరామా ! నీకు నమస్సులు నమస్సులు. ఈశ్వరునితోను పార్వతితోను కొనియాడబడ్డ రామా ! నీకు నమస్సులు నమస్సులు అని పల్లవిలోని రెండు పాదాలలోను అన్నమయ్య శ్రీరామునికి నమస్సులను తెలుపుకొంటున్నాడు.

విధింపబడ్డ ధర్మపాలకునివి. వీర దశరథరామునివి. దట్టమైన అరణ్యంలో నివసించే తాటకిని చంపినట్టిదానివి. అహల్యాశాపాన్ని పోగొట్టిన వాడివి. రాక్షసకులాన్ని నాశనం చేసినట్టి వాడివి. సహజ విశ్వామిత్రుని యాగాన్ని రక్షించినట్టి వాడివి.

ఈశ్వరుని ధనుస్సును విరిచినట్టి వానివి. సీత అనే స్త్రీకి వల్లభునివి. ఖరుడు, దూషణుడు, వాలి అనే శత్రువుల గర్వాన్ని అణచినట్టివానివి. సూర్యవంశపు కుమారులను చెట్ల పై నివసించే వానరులను పాలించినట్టి వానివి. లక్ష్మణునితో కూడా సముద్రాన్ని దాటినట్టి వాడవు.

గొప్పనైన రావణుని శిరస్సును భేదించిన వానివి. విభీషణున్ని కాపాడినట్టివానివి. అయోధ్యపురంలో నివసించే రాఘవునివి. సాటిలేని శ్రీవేంకటనిలయంలోని శ్రేష్ఠమైన విజనగర పురంలో విహరించేవానివి. పద్మాల వంటి కన్నులుగల వానివి. ఇట్టి కార్యదక్షుడవైన రామా !నీకు నమస్సులు అని



వేడుకొంటున్నాడు అన్నమయ్య. సంకీర్తనలోని శబ్దజాలమంతా సంబోధనా ప్రథమా విభక్తిలో ఉన్నది.

## శ్రీరాముని అద్భుతాలు

ఈ సంకీర్తనలో సంపూర్ణ రామచరిత్ర వివరించబడింది. సూర్యవంశంలో జన్మించిన రాముని మహిమలు అనంతాలని పరామాన్నం ద్వారా పుట్టింది మొదలుకొని అయోధ్యలో పట్టాభిషేకం చేసుకునేంతవరకు ఆయన చేసిన ఘనకార్యాలను తెలియజేస్తూ సాటిలేని ఆయన మహిమలను పొగడుతున్నాడు.

రాగము : శ్రీరాగము

పల్లవి : ఏడకేడ నీ చరితలేమని పొగడవచ్చు !
యీడులేని మహిమల యినవంశరామా ! ॥ ఏడు ॥

**36**

1. పరమాన్నములోఁబుట్టి పక్కన ( దాటికి ( జంపి
సరుస విశ్వామిత్రు యజ్ఞము గాచి
హరుని విల్లు విరిచి యట్టె సీత ( బెండ్లాడి
పరశురాముని చేత బలము చేకొంటివి ॥ ఏడు ॥

2. వైపుగా ( సుగ్రీవు ఁగూడి వాలినొక్కకోలనేసి
యేపుగా జలధిగట్టి యెసగితివి
దీపించు రావణుఁజంపి దివిజులను మన్నించి
యేపుగా విభీషణుని రాజ్యమేలించితివి ॥ ఏడు ॥

3. సీతతో ఁబుష్పక మెక్కి జిగినయోధ్య వచ్చి
గాతల రాజ్యపట్టము గట్టుకొంటివి
యీతల శ్రీవేంకటాద్రి విటు విజనగరాన
నీతితో నెలవుకొని నెగడితివి ॥ ఏడు ॥

అ.అ.సం.సం. 10 . 274

సూర్యవంశంలో జన్మించిన ఓ రామా ! నీ చరిత్రము ఎంత కెంతకైనా పొగడవచ్చు, సాటిలేని నీ మహిమలు అపారాలు.

నీవు పుట్టింది పరమాన్నంలో చంపింది గొప్పనైన తాటకి అనే రాక్షసిని రక్షించింది విశ్వామిత్రుని యజ్ఞాన్ని విరిచింది శివధనుస్సును పెండ్లాడింది లోకమాతయైన సీతను. బలాన్ని స్వీకరించింది క్షత్రియ శత్రువైన పరశురామునిది. సాటిలేని యీ మహిమలను నీ చరితాన్ని ఏమని పొగడగలం ?

చేరింది సుగ్రీవుని వైపు. ఒక్క బాణంతో చంపింది వానరవీరుడైన వాలిని. ఆనకట్ట కట్టింది వీలుకాని సముద్రంలో చంపింది ముల్లోకాలకు వీరుడైన రావణున్ని మన్నించింది దేవతలను. రాక్షస రాజ్యాన్ని ఏలించింది ధర్మాత్ముడైన విభీషణునితో ఈ మహిమలను ఏమని పొగిడేది ?

పుష్పక విమానమెక్కింది సీతమ్మతో వచ్చింది వేగంగా అయోధ్యకు. ఆ తర్వాత రామభద్రుడు పట్టాభిషేకం చేసుకొన్నాడు. ఈ విధంగా నున్న శ్రీరాముడు ఇప్పుడు వేంకటాద్రిని చేరుకొని విజనగరంలో నీతితో వెలసి ఖ్యాతిపొందుతున్నాడు. ఇన్ని గొప్ప కార్యాలకు మూలకారణంబైన రామభద్రుని సాటి మహిమలను, చరితాన్ని ఇంతకెంతకు పొగడగలనని రామభద్రుని తో విన్నవించుకొంటున్నాడు అన్నమయ్య.

## భక్తసులభ రాముడు

మొదట అన్నమయ్య అద్వైతి అయినా అహోబిలపీఠాధిపతియైన శఠకోప యతీంద్రుల వద్ద దీక్ష పొంది విశిష్టాద్వైతి అయినాడు. విశిష్టాద్వైతులకు శరణాగతి మీద ఎనలేని విశ్వాసం. అందువల్ల ఆయన గతంలో శ్రీరాముని శరణుజొచ్చిన వారిని స్మరిస్తూ తాను ఆరామభద్రుని శరణువేడుతూ దయతో నన్ను పాలించవలసిందని మొఱపెట్టుకుంటున్నాడు.

రాగము : చాయ

పల్లవి : శరణు శరణు నీకు జగదేక వందిత !
కరుణతో మమ్ము నేలు కౌసల్యానందన ! ॥ శర ॥

# 37

1. ఘనరణ రంగ విక్రమ దశరథపుత్ర !
విను తామన (ర?) సోమ వీరరాఘవ !
మునులును ఋషులును ముదము నొందిరి నీవు
జననమందినందుకు జానకీరమణ ! ॥ శర ॥

2. సులభ లక్ష్మణాగ్రజ ! సూర్యవంశ తిలక !
జలధి బంధన విభీషణవరద !
తలకి యసురలు పాతాళము చొచ్చిరి నీవు
విలువిద్య నేర్చితేనే విజయరామ ! ॥ శర ॥

3. రావణాంతక ! సర్వరక్షక ! నిర్మలభక్త !
పావన దివ్యసాకేత పట్టణ వాస !
వేవేలుగ నుతించిరి వెగు హనుమంతాదులు
సేవించిరి నినుఁ జూచి శ్రీ వేంకటేశ ! ॥ శర ॥

అ.అ.సం.సం. 10 . 276

కౌసల్యకు ఆనందాన్ని కల్గించేరామా ! ఈ ప్రపంచంతో నీవొక్కడే నమస్కరింపదగినవాడవు. నేను నిన్ను శరణుగోరుచున్నాను. దయతో నన్ను ఏలుకోవల్సింది అని పల్లవి ద్వారా తెలియజేస్తున్నాడు.

గొప్పనైన యుద్ధరంగంలో పరాక్రమాన్ని చూపించేవాడవు. దశరథుని కుమారుడవు. దేవతలచే స్తోత్రింపదగుచంద్రుని వంటివాడవు. రఘువంశంలోని మునులు ఋషులు ఆనందాన్ని పొందినారు.

భక్తులకు సులభుడవు. లక్ష్మణునికి అన్నవు. సూర్యవంశానికి తిలకం వంటి వాడవు. సముద్రాన్ని బంధించినట్టివాడవు. విభీషణుని కాపాడిన వాడవు. ఎప్పుడూ విజయాని పొందేరామా ! నీవు విలువిద్య నేర్చుకుంటూనే రాక్షసులంతా భయపడి పాతాళ లోకంలో ప్రవేశించినారు.

రావణుని చంపినట్టివాడా ! అందరినీ రక్షించేవాడా ! మాలిన్యంలేని శివభక్తా ! పవిత్రమైన దివ్యమైన అయోధ్యానగరంలో నివసించేవాడా !

హనుమంతుడు మొదలైనవారు నిన్ను చూచి అనేక వేల విధాల స్తుతించినారు. ఆనాటి శ్రీరాముడవే ఈ నాటి శ్రీవేంకటేశుడవు అంటూ వేంకటేశ్వరుని లోని రామున్ని శరణు వేడాడు.

## శ్రీరాముని ఘనకార్యాలు

శ్రీవేంకటేశ్వరునియందు కృతయుగంనందలి శ్రీరామ చంద్రుని అవతార విశేషాలను ఆయన గొప్పదనాన్ని, శివధనుర్భంగాన్ని, అహల్యా శాప విమోచనాన్ని, జటాయువుకు మోక్షానివ్వడం వారధి గట్టడం, రావణున్ని చంపడం, విభీషణునికి లంకా పట్టం గట్టడం, అయోధ్యకు వెళ్ళడం మొదలైన ఘనకార్యాలను తెలియజేస్తూ రామాయణాన్ని సంగ్రహంగా అందరికీ అర్థమయ్యే విధంగా తెలియజేసినాడు అన్నమయ్య.

రాగము నాట

పల్లవి: రాముడు లోకాభిరాముడందరికి రక్షకుడీతని దెలిసికొలువరో
కామిత ఫలదుఁడు చరాచరములకు గర్తయైన సర్వేశ్వరుడితడు
॥ రాముడు ॥

38

1. తలప దశరథుని తనయుడట ! తానే తారక బ్రహ్మము
వెలయ మానుషపు వేషమట! వెగట హరివిల్లు విరిచెనట
అలరగ తానొక రాజట ! పాదాల నహల్యశాపము మాన్పెనట
సొలవక దైవిక మానుషలీలలుచూపుచు మెరసీ చూడరో!యితఁడు
॥ రాముడు ॥

2. చరణం జగతి వశిష్టుని శిష్యుడట ! జటాయువుకు మోక్షమిచ్చెనట !
అగచరులే తన సేనలట ! అంబుధి కొండలగట్టెనట !
మగువ కొరకు గానట కమలాసను మనుమని రావణుజంపెనట !
తగ లౌకిక వైదికములు నొక్కట తానొనరించీ జూడరో యితఁడు
॥ రాముడు ॥

3. చరణం వెసనమరుల వరమడిగెనట ! విభీషణ పట్టముగట్టెనట !
యెసగ నయోధ్యకు నేలికట ! యింద్రాదులకు గొలువిచ్చెనట !
పొసగ శ్రీవేంకటగిరి భువనములు దరంబున ధరించెనట !
సుసరపు సూక్ష్మాధికములు తనయందు జూపుచున్నాడు
చూడరో యితఁడు ॥ రాముడు ॥

అ.అ.సం.సం. 10. 277

భక్తులారా ! శ్రీరాముడు లోకాభిరాముడని, ఈయన అందరికీ రక్షకుడని, కోరినకోర్కెలను తీర్చేవాడని, చరాచరాలకు కర్త ఇతడే అని, ఈయన సర్వేశ్వరుడని తెలుసుకొని ఆరాధించండి.

అనుకుంటే ఈయన దశరథునికొడుకు. ఈయనే తారకబ్రహ్మం. చూస్తే మానవ వేషం అయినా గట్టిదైన శివుని ధనుస్సును విరిచినాడు. ఈయన నౌకరాజు. తన పాదాలతో అహల్యాశాపాన్ని పోగొట్టినాడు. అలసిపోక దైవిక మానసిక లీలలను చూపుతూ ఉన్నాడు. ఇట్టిరామున్ని పరీక్షించిచూడండి.

లోకానికి వసిష్ఠుని శిష్యుడు. జటాయువుకు మోక్షమిచ్చినాడు. కొండల్లో తిరిగేవారే ఇతని సైనికులు. సముద్రంలో కొండరాళ్ళతో ఆనకట్ట కట్టినాడు. స్త్రీకోసం బ్రహ్మ మనుమడైన రావణుని చంపినాడు. వైదిక లౌకిక కార్యాలను ఈయన ఒక్కడే చేసినాడు. అలాంటి ఈయనను తనివిదీర చూసి కొలవండి.

ఈయన దేవతలను వరాలడిగినాడు. విభీషణునికి పట్టం కట్టినాడు. అయోధ్యకు ప్రభువు. ఇంద్రుడు మొదలైన వారికి కొలువు ఇచ్చినాడు. శ్రీవేంకటగిరి మొదలైన భువనాలను పొట్టలోపెట్టుకున్నాడు. కంటికి కనబడని సన్నని వస్తువులను పెద్ద వస్తువులను తనలో చూపుతూ ఉన్నాడు. అలాంటి రామభద్రుడు ఇతడు.

## సంక్షిప్త యుద్ధం

యుద్ధకాండలోని రామకథ ఇందు వివరించడం జరిగింది. వానరవీరులు యుద్ధానికి బయలుదేరింది మొదలు శ్రీరాముడయోధ్యకు వచ్చేంతవరకు సాగిన

రామకథను గూర్చి తెలుపుతూ బలోపేతుడైన ఈరాముని ప్రతాపం చాలా గొప్పదని ఆరాముడదిగో ! నమస్కరించవల్సిందని ఎలుగెత్తి చాటుతున్నాడు అన్నమయ్య.

39

రాగము : దేవక్రియ

పల్లవి : ఏమిచెప్పేది ప్రతాప మెట్టి విలుకాఁడితఁడు
రాముఁడు వీఁచె మ్రొక్కుఁడు రణరంగధీరుఁడు ॥ ఏమి ॥

1. విడిసె ( గపి బలము వెస సముద్రము దరి
నడచె లంకపై ( బౌజు నానాగతుల
తొడిగె రాముఁడు వింట దొనలోని బ్రహ్మాస్త్రము
పడె రావణుతలలు పంక్తులై ధరణిని ॥ ఏమి ॥

2. చొచ్చిరి లంకలోను సుగ్రీవాంగదాదులు
తెంచిరి రాకాసి చెర తెప్పలు గాను
యిచ్చిరి జయధ్వనులు యింద్రాది దేవతలు
మెచ్చిరందరు సీతాసమేతుఁడాయ నితఁడు ॥ ఏమి ॥

3. మగుడె (బుష్పకముపై మహిమ నితని దండు
తగఁబట్టము తానేలె తమ్ములతోను
అగపడి శ్రీవేంకటాద్రిపై నిల్చె నితఁడు
జగదేకమూర్తి కౌసల్యాసుతుఁడిపుడు ॥ ఏమి ॥

అ.అ.సం.సం. 10 . 279

శ్రీ రామచంద్రుని ప్రతాపం ఎలాంటిదని చెప్పేది ? ఈయన గొప్ప విలుకాడు. యుద్ధరంగంలో ధీరుడు. ఆరామచంద్రుడే ఇతడు నమస్కరించండి అంటూ వ్రేలెత్తి చూపుతున్నాడు.

వానర బలాన్ని సముద్రపుటొడ్డున విడిచినాడు. సముద్రంపై నడిచి లంకపై సేనల నడిపించినాడు. ఆ తర్వాత అంబుల పొదిలోని బ్రహ్మాస్త్రాన్ని ధనుస్సుపై నెక్కుపెట్టగా రావణుతలలు వరుసలుగా భూమిపై పడ్డాయి.

ఆ తర్వాత సుగ్రీవుడు అంగదుడు మొదలైన వానరవీరులు లంకలో ప్రవేశించినారు. రావణుని చెరలను కుప్పలుగా తొలగించివేశారు. ఇంద్రుడు మొదలైన దేవతలంతా జయ జయ ధ్వానాలు పలికినారు. అందరూ ఆయన చేసిన దుష్టశిక్షణాన్ని మెచ్చుకున్నారు. ఈ రామభద్రుడు సీతాసమేతుడయినాడు.

శ్రీరాముని దండు మహిమగల పుష్పకంపై మరలింది. పట్టాభిషిక్తుడై తమ్ములతో అయోధ్య నేలినాడు. అటు తర్వాత జగదేకమూర్తియైన కౌసల్యాకుమారుడు శ్రీవేంకటాద్రిపై నిల్చికనబడుతున్నాడు. అలాంటి రామభద్రుడిదిగో నమస్కరించండి అంటూ అన్నమయ్య స్వామిని భక్తులకు చూపిస్తున్నాడు.

## శ్రీరాముని దివ్యమహిమలు

శ్రీరాముని మహిమలు కోకొల్లలు. ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క మహిమను ప్రదర్శించి ఆయన తన గొప్పదనాన్ని నిరూపించుకొన్నాడు. అనేక మహిమలను చూపించిన రామభద్రా ! నీవే మాకు దిక్కు అంటూ అన్నమయ్య ఆ మహిమ లేమిటో వివరిస్తూన్నాడు ఈ సంకీర్తనలో.

రాగము : మేఘరంజి

పల్లవి ఇందులోనే కానవచ్చె నిన్నిటా నీ మహిమలు
చెంది నీవే దిక్కు మాకు సీతాపతి రామా ! ॥ ఇందు ॥

1\. దేవ ! నీకు వలసితే తృణము బ్రహ్మాస్త్రమాయ
భావించి రాతికి (బ్రాణము వచ్చె
కావలసి యేసితే నాకాశము కట్లు దెగె
దైవ మవంటే నీవే దశరథ రామా ! ॥ ఇందు ॥

40

2\. కూరుచుక యేలితేను కోంతులు రాజ్యముసేసె
కోరితేనే నీటిపై ( గొండలు దేలె
సారె (గదలి వచ్చె నీ సన్నల సంజీవికొండ
యేరీతి నీసరి వేరీ యినకుల రామా ! ॥ ఇందు ॥

3. సూటి నీవు దలఁచితే సురలు పంపుసేసిరి
చాటితేనే నీపేరు జపమాయను
ఆటల నీకతలెల్లా నా చంద్రార్కమై నిలిచె
గాటపు సిరుల శ్రీవేంకటగిరి రామా ! ॥ ఇందు ॥

అ.అ.సం.సం. 10. 280

సీతాదేవి భర్తవైన శ్రీరామచంద్రా ! రామాయణమంతటా మరియు ఇందులోనంతా నీ మహిమలు కనబడ్డాయి. ఇక నీవే మాకు దిక్కు.

ఓ రామదేవా ! నీకు అవసరం అనుకున్నపుడు గడ్డిపోచనే బ్రహ్మాస్త్రమయ్యింది. నీవు భావించినంతనే రాయికి కూడా ప్రాణం వచ్చింది. నీవు అనుకున్నంతనే ఆకాశం కట్లు తెగినాయి. దశరథరామా ! దేవుడంటే నీవే తప్ప వేరొకరుకాదు.

సూర్యకులానికి చెందిన ఓ రామా ! నీవు కూర్చొని ఏలితే కోతులు రాజ్యాన్ని ఏలినాయి. నీవు కోరిన వెంటనే సముద్రపు నీటి మీద కొండలు తేలినాయి. నీ సైగలతోనే సంజీవికొండ తరలి వచ్చింది. ఏ విధంగా చూసినా నీతో సమానమైన వారెవ్వరూ లేరు.

దట్టమైన సంపదలతో గూడిన వేంకటగిరి రామా ! నీవు తలచుకుంటేనే నీకోసం దేవతలెల్లా పంపబడ్డారు. నీ పేరు వ్యాప్తి చెందగానే అదే జపమైపోయింది. ఆటల ద్వారా (నాటకాలద్వారా) సూర్యచంద్రులున్నంత వరకు నిలిచింది.

## శ్రీరాముని ప్రతాపానికి రాక్షసులు బెదరిపోవడం

శ్రీరాముని ప్రతాపం ఈ సంకీర్తనలో వివరించబడింది. ఇంతకు ముందు కూడా ఇతర సంకీర్తనలో రామ ప్రతాపం వర్ణింపబడింది. అయితే ప్రతిసంకీర్తనలోను ఏదో ఒక ప్రత్యేకతను చూపించడమే అన్నమయ్య విశిష్టత. శివధనుస్సును విరిచినపుడు , వనవాసం బయలుదేరినపుడు దండకను చేరినపుడు, శూర్పణఖ ముక్కుకోసినపుడు, మారీచునిపై బాణం వేసినపుడు, విభీషణునికి అభయమిచ్చినపుడు రాక్షసులు స్పందించడాన్ని ఎంతో చమత్కారంగా తెలియజేశాడు అన్నమయ్య.

రాగము : దేసి

పల్లవి: ఏమని చెప్పఁగవచ్చునిదివో నీ ప్రతాపము
రామ ! రామభద్ర ! సీతారమణ ! సర్వేశ ! ॥ ఏమ ॥

**41**

1. వెరవున హరువిల్లు విరుఁగ దీసిన నాఁడె
అరయ విరిగె వీపు లసురులకు
వరుస వనవాసపు వ్రతము పట్టినపుడె
పరుల మతుల భీతి వట్టె రఘురామ ! ॥ ఏమ ॥

2. వచ్చి నీవు దండకావనము చొచ్చిన నాఁడె
చొచ్చిరి పాతాళమసురు లెల్లాను
ముచ్చటాడి చుప్పనాతిముక్కుగోసిన నాఁడె
చొచ్చి దైత్యులాస నెగఁగోసిరి శ్రీరామ ! ॥ ఏమ ॥

3. అడరి మారీచుపై నమ్ము విడిచిన నాఁడె
విడిచిరి దానవులు వేడుకలెల్లాను
బడి విభీషణునిఁజేపట్టితే రక్కసులెల్లా
చిడిసి మల్లెవట్టిరి శ్రీవేంకటరామ ! ॥ ఏమ ॥

అ.అ.సం.సం. 10 . 281

శ్రీరాముడా ! రామభద్రా ! సీతారమణుడా ! సర్వేశ్వరుడా ! నీ ప్రతాపం ఏమని చెప్పవచ్చును. ఇదుగో చూడు అంటూ ఆ శ్రీరామునికే విన్విస్తున్నాడు.

రఘువంశంలో పుట్టినరామా ! నీవు శివుని విల్లు విరిచిననాడే అసురులకు వీపులు విరిగినాయి. క్రమంగా వనవాసవ్రతం చేపట్టిన నాడే శత్రువులకు భయం కల్గింది.

శ్రీరామా ! నీవు దండకారణ్యానికి వెళ్ళిన నాడే అసురులంతా పాతాళం ప్రవేశించినారు. శూర్పణఖతో ముచ్చటలాడి ఆమె ముక్కుచెవులను కోసిననాడే వారు తమ ఆశలను వదలుకొన్నారు.

శ్రీవేంకటరామా ! ప్రయత్నించి మారీచునిపై బాణాన్ని విడచిననాడే

దానవులు తమ తమ వేడుకలనన్నింటిని వదలుకొన్నారు. నీవు విభీషణుని చేపట్టితే రాక్షసులంతా చిడిసి మల్లెవట్టినారు.

ఈ సంకీర్తనలో శ్రీరాముడు వివిధ మహిమలను చూసినపుడు రాక్షసుల వివిధ భయాలను, పలాయనాలను వివరించడం జరిగింది.

## శ్రీరామబాణ మహిమ

"ఒకే బాణం ఒకే పత్ని" అని ప్రసిద్ధి గాంచినట్టివాడు రామభద్రుడు. రామబాణానికి తిరుగులేదు. రామబాణం చాలా ప్రశస్త మైనట్టిది. అందువల్లే అన్నమయ్య దృష్టి రామబాణంపై పడింది. దేనిపైబడితే దానిపై ఒక సంకీర్తన. ఇంకేముంది ఏకంగా రామబాణం మీదే ఒక సంకీర్తన రచించాడు. ఎప్పుడెప్పుడు రామబాణం ఎవరెవరిని చంపిందో వివరిస్తూ దాని గొప్పదనాన్ని ఈ సంకీర్తనలో తెలియజేస్తున్నాడు.

రాగము : సామంతం

పల్లవి : రామునికి శరణంటే రక్షించీబ్రదుకరో
యేమిటికి విచారాలు యిఁక దైత్యులాల ! ॥ రామ ॥

42

1. చలమునఁ దాటకిఁ జదిపిన బాణము
లలి మారీచ సుబాహులపై బాణము
మెలఁగి పరశురాము మెట్లేసిన బాణము
తళతళమెరిసీని తలరో యసురలు ॥ రాము ॥

2. మాయామృగము మీఁద మరివేసిన బాణము
చేయి చాఁచి వాలి నేసిన బాణము
తోయని మీఁద నటు తొడిగిన బాణము
చాయలు దేరుచున్నది చనరో దైతేయులు ॥ రాము ॥

3. తగ కుంభకర్ణుని తల ద్రుంచిన బాణము
జిణి రావణుఁబరిమార్చిన బాణము

మిగుల శ్రీవేంకటేశు మేఁటి పాద (ది?) లోనున్నది
పగ సాధించీ నిఁకఁబారరో రాకాసులు ॥ రాము ॥
అ.అ.సం.సం. 10 . 283

రాక్షసులారా ! ఇక మీకు వేరు ఆలోచనలు ఎందుకు ? రామున్ని శరణువేడండి. శరణంటే ఆయన మిమ్ముల‌ను రక్షించగలడు. మీరు భూమిపై బతకగలరు అని రాక్షసులను హెచ్చరిస్తున్నాడు.

చలమున తాటకిని చంపినదీబాణం. మారీచసుబాహువులను చంపిన బాణమిఁది. అణగి పరశురాముని గెలిచిన బాణం. ఇది తళ తళ మెరిసేది తొలగిపొండి రాక్షసులారా !

మాయ బంగారు జింకపై వేసిన బాణమిది. చేయిచాపి వాలిపై వేయబడ్డ బాణమిది. సముద్రం మీదకు ఎక్కుపెట్టబడిన బాణం. ఇది రంగులు మారుతూ ఉంది. ప్రక్కకు వెళ్ళండి రాక్షసులారా !

కుంభకర్ణుని తలనునరికిన బాణమిది. ప్రకాశంతో రావణున్ని చంపిన బాణం. అట్టి దివ్య బాణం శ్రీవేంకటేశ్వరుని గొప్ప అంబులపొదిలో ఉంది. పగసాధించక తీరదది. ఆలస్యం చేయక పారిపొండి.

మీరుగనుక ఆయున్ను శరణువేడితే రక్షిస్తాడు. భూమిపై బ్రదుకగలుగుతారు ఆలస్యం చేయక శరణువేడండి అని రాక్షసులలో భయాన్ని కల్గించి శరణాగతి మహత్యాన్ని తెలియజేస్తున్నాడు పదకర్త.

## శ్రీరాముని శరణువేడండని రాక్షసులకు హితవు చెప్పడం

రాక్షసులకు సీతా- రామ- లక్ష్మణ- భరత-శత్రుఘ్న-వాలి-సుగ్రీవ-హనుమ- జాంబవంత మొదలగు వారి దైవాంశాలను చెబుతూ శ్రీరామునితో కాదని, ఆయన స్వరూపాలను తెలుసుకొని ఆయనను శరణువేడండని అన్నమయ్య సందేశాన్నివ్వడం ఇందు వర్ణించడమైంది.

# 43

రాగము : శోకవరాళి

పల్లవి : ఓహో ! రాకాసులాల ! వొద్దు సుండి వైరము
దేవుని శరణనరో ! తెలుసుకోరో ! ॥ ఓహో ॥

1. జగములో రాముఁడై జనియించె విష్ణుఁడనె
అగపడి లక్ష్మి సీతయై పుట్టెను
తగుశేష చక్ర శంఖ దైవసాధనములెల్ల
జిగి లక్ష్మణ భరతాంచిత శత్రుఘ్నులైరి ॥ ఓహో ॥

2. సురలు వానరులైరి సూర్యుఁడు సుగ్రీవుఁడు
మరిగిఁరు(ద)ఁడె హనుమంతు డాయను
సరుస బ్రహ్మదేవుఁడు జాంబవంతుఁడైనాఁడు
వెరవరి నలుఁడే విశ్వకర్మసుండి ॥ ఓహో ॥

3. కట్టిరి సేతువపుడె ఘనులెల్ల దాఁటిరి
ముట్టిరి లంకానగరము నీ దళము
యిట్టె శ్రీవేంకటేశుఁడితఁడై రావణుఁజంపె
వొట్టుక వరము లిచ్చి నొనర దాసులకు ॥ ఓహో ॥

అ.అ.సం.సం. 10 . 295

ఓహో ! రాక్షసులారా ! శ్రీరామునితో వైరం మంచిదికాదని ఆయన్ను దేవుడని తెలుసుకొని శరణువేడండి.

విష్ణువు ఈ ప్రపంచంలో రాముడై జన్మించినాడు. లక్ష్మి సీతయై పుట్టింది. ఆదిశేషుడు శంఖం చక్రము మొదలైన దేవసాధనాలు లక్ష్మణ భరత శత్రుఘ్నులుగా పుట్టినాయి.

దేవతలు వానరులైనారు. సూర్యుడు సుగ్రీవుడైనాడు. ఈశ్వరుడు హనుమందుడైనాడు. బ్రహ్మజాంబవంతుడైనాడు. విశ్వకర్మ నలుడైనాడు.

ఘనులైన వీరంతా అపుడే సేతువు కట్టినారు. నీ సైన్యంలోని నాయకులు

లంకా నగరాన్ని ముట్టినారు. ఇట్లే శ్రీవేంకటేశ్వరుడే రాముడై రావణున్ని చంపి ప్రకాశించువాడై దాసులకు వరములిస్తున్నాడు. ఇంత గొప్పనైన శ్రీరామునితో వైరము మంచిదికాదని సారాంశం.

ఈ సంకీర్తనలో శ్రీరాముడు మొదలుకొని వివిధ వానరులవరకు వారివారి అవతారాంశాలను వివరించడం ఎంతో అద్భుతంగా ఉంది.

## ఉత్తరరామకథ

శ్రీరాముడు సీతకొఱకై లంకకు వారిధికట్టి రావణున్ని చంపడం, ఆ తర్వాత పుష్పకవిమానం మీద అయోధ్యకు వెళ్ళడం, అశ్వమేధ యాగాన్ని చేయడం మొదలగు అంశాలను గూర్చి ఈ సంకీర్తనలో తెలియజేయడం జరిగింది. శ్రీరాముడి విజయపరంపరలను గొప్పకార్యాలను నిగ్రహానుగ్రహాలను ఇందు వివరించడం జరిగింది.

44

రాగము : బౌళిరామక్రియ

పల్లవి : దేవతలఁ గాచిన దేవుఁడితఁడు
వేవేలు ప్రతాపముల వీరరాముఁడితఁడు ॥ దేవ ॥

1. రావణుఁ జంపి పుష్పకరథమెక్కి సీతతోడ
రావుగానయోధ్యను పట్టము గట్టుక
వావిరి సుగ్రీవాది వానరకోట్లు గొలువ
చేవమీరి పొగడొందు శ్రీరాముఁడితఁడు ॥ దేవ ॥

2. వసుధయింతయు నేలి వసిష్ఠాదులు వొగడ
యెసగ నశ్వమేధాలెల్లాఁ జేసి
పొసఁగఁ గుశలవుల పుత్రులుగా నటుగాంచి
రసికత మించు దశరథరాముఁడితఁడు ॥ దేవ ॥

3. అలర రుద్రునెదుట నటు విశ్వరూపు చూపి
లలి బ్రహ్మపట్ట మనిలజుని కిచ్చి

యిల శ్రీవేంకటాద్రి నిరవై నిలచినాఁడు
చలము సాధించిన జయ రాముఁడితఁడు ॥ దేవ ॥

అ.అ.సం.సం. 11 . 4

ఈ శ్రీరాముడు దేవతలను రక్షించినట్టివాడు. వేలకువేల ప్రతాపాలు కల్గినట్టి వీరరాముడీయన.

ఇలాంటిరాముడు రావణున్ని చంపి పుష్పక విమానాన్ని ఎక్కి ఠీవిగా అయోధ్యకు వెళ్ళిపట్టం కట్టుకున్నవాడు. ఆ తర్వాత సుగ్రీవుడు మొదలైన కోట్ల కొద్ది వానరులు కొలువగా చేవ మీరి పొగడ్తలను పొందినవాడు.

భూమండలాన్ని ఎంతో చక్కగా ఏలి వసిష్ఠుడు మొదలైన వారు పొగడంగా అశ్వమేధయాగాలనన్నింటిని చేసి కుశలవులను పుత్రులనుగా గాంచి రసికత మించిన దశరథరాముడితడు.

ప్రకాశించి ఈశ్వరుని ఎదుట విశ్వరూపాన్ని చూపి ప్రేమ మీద హనుమంతునికి బ్రహ్మపట్టానిచ్చి ఈభూమండలం పైనున్న వేంకటాద్రుని నివాసంగా ఏర్పాటుచేసుకొని చలాన్ని సాధించిన జయరాముడీయనే అని శ్రీరామున్ని చూపి మరీ నిర్దేశిస్తూ ఉన్నాడు.

## శ్రీవేంకటరాముడు

దశరథపుత్రుడైన శ్రీరామునికి నమస్కరిస్తూ మమ్మురక్షించుమని వేడుకొంటూ ఆయన సాధించిన వివిధ ఘనకార్యాలను గుర్తు చేస్తూ ఆయన గొప్పదనాన్ని ఈ సంకీర్తనలో తెలియజేస్తూ ఉన్నాడు పదకర్త అన్నమయ్య.

రాగము : మాళవశ్రీ

పల్లవి : నమో నమో దశరథనందన మమ్ము రక్షించు
కమనీయ శరణాగత వజ్ర పంజరా ! ॥ నమో ॥

# 45

1. కోదండ దీక్షాగురుఁడ రామచంద్ర !
ఆదిత్యకుల దివ్యాస్త్ర వేది
సోదించు మారీచుని తలగుండు గండ గండు శూరుడు
ఆదినారాయణ యసురభంజన ॥ నమో ॥

2. ఖరదూషణ శిరః ఖండన ప్రతాప
శరధి బంధన విభీషణ వరదా !
అరయ విశ్వామిత్రయాగసంరక్షణ
ధరలోన రావణదర్పాప హరణ ! ॥ నమో ॥

3. పొలు పొంద నయోధ్యపురవరాధీశ్వర !
గెలుపొందిన జానకీరమణ !
అలఘు సుగ్రీవ అంగదాదికపిసేవిత !
సలలిత శ్రీవేంకటశైలనివాసా ! ॥ నమో ॥

అ.అ.సం.సం. 11 . 5

దశరథుని కుమారుడవైన ఓ రామచంద్రా ! శరణాగతులకు మనోహరమైన వజ్రపంజరం లాంటివానివి. అలాంటి నీకు మాటిమాటికి నమస్కారం. నీవు మమ్మల్ని రక్షించాలి.

స్వామీ ! రామచంద్రా ! నీవు కోదండ దీక్షాగురునివి. సూర్యవంశంలో పుట్టిన దివ్యాస్త్రవేదివి. నిరంతరం మునులను వెదకి పీడించే మారీచునికి శ్రేష్ఠమైన శూరునివి. రాక్షసులను చంపేవాడివి. ఆదినారాయణునివి నీవే.

ఖరుడు దూషణుడు మొదలైన వారి శిరస్సులను ఖండించినట్టి ప్రతాప వంతునివి. సముద్రానికి ఆనకట్ట కట్టినట్టివాడవు. విభీషణునికి అభయమిచ్చి రావణుని దర్పాన్ని అణచినట్టివాడవు.

కీర్తి పొందిన అయోధ్యాపురానికి శ్రేష్ఠమైన అధీశ్వరునివి. రాక్షసులతోడి యుద్ధంలో గెలుపొందిన జానకీరమణునివి. గొప్పవైన సుగ్రీవుడు అంగదుడు మొదలైన వానరులచే సేవింపబడినవాడవు. సుకుమారమైన శ్రీవేంకటపర్వతంపై

నివాస మేర్పరచుకొన్న శ్రీరాముని రూపం గల్గిన శ్రీవేంకటేశ్వరుడవు. అలాంటి నీకు నమస్కారాలు. నమస్కరించే మమ్ములను దుష్టులబారినుండి రక్షించవలసింది.

## శ్రీరాముని అద్భుతనామాలు

శ్రీరాముడు పట్టుదలకలవాడు. ఈయన ధాటికి ఎదురే లేదు. ఇలాంటి రామున్ని అనేక విధాల సంబోధిస్తూ ఈ సంబోధనలో ఈయన చేసిన ఘనకార్యాలను గూర్చి ప్రశంసించడం ఈ సంకీర్తనలోని సారం.

46

రాగము : రామక్రియ

పల్లవి : భళిభళిరామా ! పంతపురామా ! నీ
బలిమి కెదురు లేరు భయహర ! రామా ! ॥ భళి ॥

1. విలువిద్యరామా ! వీరవిక్రమ రామా !
తలకొన్న తాటకాంతక రామా !
కొలమై (?) ఖరుని తల గుండు గండ ! రామా !
చలమరి సమరపు జయరామ ! రామా ! ॥ భళి ॥

2. రవికుల రామా ! రావణాంతక రామా !
రవిసుత ముఖ ! కపిరాజు ! రామా !
సవరఁగాఁ గొండలచే జలధిగట్టిన రామ!
జవసత్త్వసంపన్న ! జానకీరామ ! ॥ భళి ॥

3. కౌసల్యరామా ! కరుణానిధి రామా !
భూసుర వరద ! సంభూత రామా !
వేసాల ఁబొరలే శ్రీవేంకటాద్రిరామ !
దాసుల మమ్ము ఁగావఁదలకొన్న రామ ! ॥ భళి ॥

అ.అ.సం.సం. 11 . 62

ఓ రామా ! నీవు పట్టుదలగల్గిన రామునివి. ఇతరుల భయాన్ని పోగొట్టేవానివి. నీధాటికి ఎదురొచ్చేవారు ఎవరూలేరు. భళి భళి నీ పరాక్రమాన్ని గూర్చి ఏమని చెప్పేది.

నీవు విలు విద్యలలో నిపుణుడైన వానివి. వీర విక్రమునివి. ఎదురించిన తాటకిని చంపినట్టివానివి. ఖరుడనే రాక్షసుని తలగుండుకు శూరునివి.

సూర్యకులానికి చెందిన రామునివి. రావణున్ని చంపిన వానివి. రవిసుత ముఖుడివి. కోతులకు రాజువు. కొండలచే అమర్చి ఆనకట్టను కట్టినవాడవు. జవసత్త్వసంపన్నుడవు. జానకీరామునివి.

కౌసల్యారామునివి. కరుణానిధివి. విద్వాంసులను కాపాడేవాడివి. చక్కటి రామునివి. వేషాలతో ప్రకాశించే శ్రీవేంకటాద్రిరామునివి. దాసులమైన మమ్ములను రక్షించతలపెట్టిన శ్రీరామునివి. నీ గొప్పదనాని ఏమని పొగిడేది ?

## శ్రీరామసేవ

శ్రీరామునికి సంబంధించిన సంస్కృత సంకీర్తన ఇది ఇందు అన్నీ రాముని గుణ గుణాలను తెలిపే పదాలే ఉన్నాయి. అన్నీ ద్వితీయాంత విభక్తులే. కేవల ద్వితీయాంతాలతోనే అర్థవంతంగా సంకీర్తనను రచించి రాముని గుణగుణాలను తెలియజేయడం జరిగింది.

రాగము : బౌళి

పల్లవి : రామ మిందీవరశ్యామం పరాత్పర
ధామం సురసార్వభౌమం భజే ॥ రామ ॥

1. సీతా వనితా సమేతం
పీత (ప్రీత?) వానరబల వ్రాతం
పూత కౌసల్యా సంజాతం
వీత భీత మౌని విద్యోతమ్ ॥ రామ ॥

47

2. వీరం రణరంగ ధీరం
సారధర్మకులోద్ధారం
క్రూరదానవ సంహారం
శూరాధారాచార సుగుణోదారమ్ ॥ రామ ॥

3. పావనం భక్తి సేవనం
దైనిక విహగప ధావనం
రావణానుజ సంజీవనం
శ్రీవేంకటపరిచిత భావనమ్ ॥ రామ ॥

అ.అ.సం.సం. 11 . 157

నల్లకలువలవంటి శరీరంగల వానివి, పరాత్పరధామము గలవాన్ని దేవతలకు సార్వభౌముడైన రాముని నేను సేవిస్తూ ఉన్నాను.

సీతాదేవితో కూడినట్టి వానిని, వానరబల సమూహంతో బలమైన వానిని, పవిత్రమైన కౌసల్యకు పుట్టినవానిని, భయంలేక మౌనుల మధ్య వెలుగొందేవానిని, నేను సేవిస్తూ ఉన్నాను.

వీరుని రణరంగధీరుని , సారధర్మకులోద్ధారుని, క్రూరులైన రాక్షసులను చంపేవానిని, శూరులకు ఆధారమైన ఆచారం గలవానిని, సుగుణాలతో కూడిన ఉదారమైన వానిని నేను సేవిస్తూ ఉన్నాను.

పవిత్రమైనవానిని, భక్తిసేవనుని, రోజా గరుత్మునిపై పయనించు వానిని, విభీషణునికి సంజీవని వంటివానిని, శ్రీవేంకటంపై అందరికీ కనిపించువానిని నేను సేవిస్తూ ఉన్నాను.

## శ్రీరామనుతి

శ్రీరాముని గుణాలను గూర్చి తెలియజేసిన సంస్కృత సంకీర్తన ఇది. ఈ సంకీర్తనలో వాడిన పదాలన్నీ సంబోధన ప్రథమావిభక్తికి చెందినవే.

ఈ విధంగా కేవలం ఒకే విభక్తికి చెందిన పదాలతో రాముని గుణగుణాలను తెలుపడం అన్నమయ్య గొప్పదనం.

రాగము : బౌళి

పల్లవి : నమో నమో రఘుకులనాయక దివిజవంద్య !
నమో నమో శంకర నగజ (జా?) నుతా ! ॥ నమో ॥

# 48

1. విహిత ధర్మ పాలక ! వీర దశరథరామ !
గహన వాసినీ తాటకామర్దన !
అహల్యా శాపమోచన ! అసురకులభంజన !
సహజవిశ్వామిత్ర ! సవన రక్షకా ! ॥ నమో ॥

2. హరకోదండహర ! సీతాంగనా వల్లభ !
ఖరదూషణాది వాలిగర్వాపహా !
తరణితనూజాది తరుచర పాలక !
శరధిలంఘన కృత్య ! సౌమిత్రి సమేతా ! ॥ నమో ॥

3. బిరుదరావణ శిరోభేదక ! విభీషణా !
వరద సాకేత పురవాస రాఘవ !
నిరుపమ శ్రీవేంకటనిలయ విజనగర
పురవరవిహార ! పుండరీకాక్షా ! ॥ నమో ॥

అ.అ.సం.సం. 11 . 176

రఘువంశపు నాయకుడా ! దేవతలచే నమస్కరింపదగినవాడా ! పార్వతీ శంకరులతో స్తుతింపబడినవాడా ! నీకు నమస్సులు నమస్సులు నమస్సులు నమస్సులు.

శాస్త్రములో చెప్పబడ్డ ధర్మాన్ని పాలించేవాడా ! వీరుడైన దశరథరామా ! దట్టమైన అరణ్యంలో ఉండే తాటకను చంపినవాడా ! అహల్యకు శాపవిముక్తుడా ! రాక్షసకులాన్ని నశింపజేసినవాడా ! విశ్వామిత్రుని యజ్ఞాన్ని రక్షించినవాడా ! నీకు నమస్సులు.

ఈశ్వరుని ధనుస్సును విరిచినవాడా ! సీతాదేవికి భర్తయైన వాడా ! ఖరుడు దూషణుడు వాలి మొదలైన శత్రువుల గర్వాన్ని పోగొట్టినవాడా ! తరణి కూతురు మొదలైన చరాచరప్రాణులను పాలించేవాడా ! సముద్రాన్ని దాటిన వాడా ! లక్ష్మణునితో కూడిన వాడా ! నీకు నమస్సులు.

పేరుగాంచిన రావణుని శిరస్సును ఖండించినవాడా ! విభీషణున్ని

కాపాడినవాడా ! అయోధ్యపురంలో నివసించేవాడా ! రఘువంశానికి చెందినవాడా ! సాటిలేని శ్రీవేంకటపర్వతాన్ని నివాసముగా కలిగిన వాడా! శ్రేష్ఠమైన విజనగరమనే పురంలో నివసించేవాడా ! పద్మములవంటి కన్నులు గల శ్రీవేంకటరామా ! నీకు నమస్సులు అని ఒకటికి నాలుగు సార్లు మ్రొక్కుకుంటూ ఉన్నాడు అన్నమయ్య.

## సామంతులకానుకలు

శ్రీరామ కొలువు వేళ శ్రీరామున్ని సంబోధిస్తూ ప్రభూ ! నీ సోదరులు, వానరవీరులు, రాక్షసవీరులు, రాజరాజులు మిగిలిన సామంతులెల్లా నీకు వివిధ కానుకలినిస్తూ ఉన్నారు. పరాకుగా లేక మనసార వారిచ్చే కానుకలను స్వీకరించవల్సిందని శ్రీరామునికి విన్నవించుకుంటున్నాడు అన్నమయ్య.

రాగము : సాళంగనాట

పల్లవి : చిత్తా ! అవధారు జియ్య పరాకెచ్చరికె
హత్తి కానుకలిచ్చేరు అదె రాజరాజులు ॥ చిత్తా ॥

**49**

1. రామ ! రఘుకులవీర ! రాజీవలోచన !
కోమల శ్యామలవర్ణ ! కొలువువేళ
వామదేవాది మహామునులు వారె ! సుగ్రీవుఁడు వాఁడె !
వేదూరును వానరవీరులు మొక్కేరు ॥ చిత్తా ॥

2. దేవ ! సీతాసమేత ! ధీరలోకనాయక !
భావించ నవధరించు పొఁజు వేళ
పావని యల్లవాఁడె ! భల్లూకపతి వీఁడె !
సేవించీని భరతుని (జేకొను శత్రుఘ్నుని ॥ చిత్తా ॥

3. శ్రీమదయోధ్యావిహార ! శ్రీవేంకటనివాస !
సామజ వాజిరథాల సందడి వేళ
సౌమిత్రి యీ వంక విభీషణుడు నావలివంక
నీమహిమలెల్లా మెచ్చి నీకు విన్నవించేరు ॥ చిత్తా ॥

అ.అ.సం.సం. 11 . 177

రామభద్రా ! మనసార దృష్టిని నిలుపు. అదుగో రాజరాజులు నీకు ఎన్నో కానుకలనిస్తూ ఉన్నారు. వాటిని స్వీకరించవల్సింది.

రామ ! నీవు రఘుకులవీరునివి. పద్మాలవంటి కన్నులు గలవానివి. కోమలమైన నల్లనిదేహంగల్గిన వానివి. నీవు దర్బార్ నడిపే వేళలో వామదేవుడు మొదలైన మునులు అరుగోవారె ! అదుగో సుగ్రీవుడు. అరుగో వానరవీరులు వేలకొద్దిసార్లు మ్రొక్కుతూ ఉన్నారు.

దేవ ! సీతతో కూడు కొన్నట్టి వాడా ! ధీరలోకనాయకా ! ఫౌజువేళలో వారినొక్కసారిచూడు. అదుగో! అతడే ఆంజనేయుడు. ఆయనే జాంబవంతుడు. భరతుడునిన్ను ప్రేమిస్తున్నాడు. శత్రుఘ్నున్ని కౌగిలించుకో !

శ్రీమదయోధ్యాపురంలో విహరించే వాడా !శ్రీవేంకటపర్వతాన్ని నివాసంగా గల్గినట్టివాడా ! ఏనుగులు, గుఱ్ఱాలు, రథాల సందడివేళ ఈ వైపు లక్ష్మణుడు అటువైపు విభీషణుడు నీ మహిమలనన్నింటిని మెచ్చి నీకు విన్నవించుకుంటూ ఉన్నారు. వారిపై మనసారదృష్టి నిలిపి వారిచ్చే కానుకలను స్వీకరించు అంటూ వారి తరపున వకాల్తా పుచ్చుకుంటున్నాడు అన్నమయ్య.

## శ్రీరాముని సాహసగాథలు

శ్రీరాముని ఆశ్చర్యకరమైన చేష్టలను ఈ సంకీర్తనలో పేర్కొనడం జరిగింది. రాముడు తన సోదరులతో మానవ వేషంలో జన్మించింది మొదలు కుశలవులను కన్నంతవరకు ఏడు కాండలలోని రామాయణ గాథనంతా సంక్షిప్తంగా వివరించడం జరిగింది. అన్నమయ్య సంక్షిప్తతా కౌశలానికి పరాకాష్ఠ ఇది.

రాగము : మాళవి

పల్లవి : చెప్పితే నాశ్చర్యము చేసిన చేఁత లితఁడు
ముప్పిరి మనుజవేషమునఁబుట్టె నీతఁడు చెప్పి

# 50

1. రాముఁడుదయించె దశరథునికి దమ్ములతో
క్రూరమైన తాటకిని ఖండించెను
ఆముక యజ్ఞము గాచె హరుని విల్లు విరిచె
ప్రేమమున సీతాదేవి బెండ్లియాడెను ॥ చెప్పి ॥

2. మడియించె ఖరునిని మారీచుని వధియించె
కెడపె వాలిని యా సుగ్రీవుని బెంచె
జడధి బంధించెను నరుగ రావణుఁగొట్టి
బడినే విభీషణుని బట్టము గట్టెను ॥ చెప్పి ॥

3. సీతాదేవితో నయోధ్యాసింహాసనంబెక్కె
పోతరించి కుశలవ పుత్రుల గాంచె
శ్రీతరుణితో గూడ శ్రీవేంకటేశుఁడై నిల్చె
కౌతుకమున జగము కరుణఁగాంచెను ॥ చెప్పి ॥

అ.అ.సం.సం. 11 . 182

శ్రీరాముని చేష్టలను గూర్చి చెపితే ఆశ్చర్యం కలుగక మానదు. ఇతడు ముమ్మూర్తులా మానవరూపంలో పుట్టినాడు.

రాముడు లక్ష్మణ భరత శత్రుఘ్నులైన తన తమ్ములతో జన్మించినాడు. ఆ తర్వాత క్రూరమైన రాక్షసులను ఖండించినాడు. ఆ తర్వాత విశ్వామిత్రుని యజ్ఞాన్ని రక్షించి శివధనుస్సును విరిచాడు. ప్రేమమీర సీతను పెండ్లాడాడు.

ఖరుడిని చంపి మారీచున్ని చంపాడు. వాలిని చంపి సుగ్రీవున్ని కాపాడాడు. సముద్రానికి ఆనకట్టకట్టి రావణున్ని చంపాడు. ఆపైన విభీషణునికి పట్టాభిషేకం చేశాడు.

సీతాదేవితో కలిసి అయోధ్యాసింహాసనాన్నెక్కినాడు. బలిష్ఠుడై కుశలవులనే పుత్రులను కన్నాడు. అటుపై లక్ష్మీ తరుణితో కలిసి శ్రీవేంకటేశ్వరుడై నిల్చి సంతోషంమేర లోకాన్నంతా దయతో గాంచాడు.

# శ్రీరాముని ప్రతాపం

శ్రీరాముని లోకోత్తగాథలను తెలియజేస్తూ ఆయన మహత్త్వాన్ని ప్రతిపాదం నందు తెలియజేస్తూత రామాయణాన్ని పామరులకు కూడా తెలిపి భక్తుల్లో భక్తిని పెంపొందింపజేస్తున్నాడు.

రాగము : దేవగాంధారి

పల్లవి : ఎంత వినుతుయింతు రామరామ ! యిట్టె నీ ప్రతాపము రామ రామ !
పంతాన సముద్రము రామ రామ ! బంధించవచ్చునా రామ రామ !
॥ ఎంత ॥

51

1. బలుసంజీవనికొండ రామ రామ! బంటుచే (దెప్పించితివి రామ రామ!
కొల(దిలేని వాలిని రామ రామ! ఒక్కకోలనేసితివట రామ రామ !
వెలయనెక్కువెట్టి రామ రామ! హరువిల్లు విరిచితివట రామ రామ!
పెలుచు భూమిజను రామ రామ! పెండ్లాతివట రామ రామ! ॥ ఎంత॥

2. శరణంటే విభీషణుని రామ రామ! చయ్యన (గాచితివట రామ రామ!
బిరుదల రావణుని రామ రామ! పీ(చ మడ(చితివట రామ రామ!
ధరలో (జక్రవాళము రామ రామ! దోటి వచ్చితివ(ట రామ రామ!
సురలు నుతించితివట రామ రామ! నీచొప్పుయి (క నదియెంతో రామ రామ ! ॥ ఎంత ॥

3. సౌమిత్రి భరతులు రామ రామ! శత్రుఘ్నులు(డు(?) దమ్ములటరామ రామ!
నీ మహత్త్వము రామ రామ! నిండె జగములెల్లా రామ రామ!
శ్రీమంతుడన్నిటాను రామ రామ! శ్రీవేంకటగిరి మీ(ది రామ రామ!
కామిత ఫలదు(డవు రామ రామ! కౌసల్యానందను(డవు రామ రామ!
॥ ఎంత ॥

అ.అ.సం.సం. 11 . 190

రామా ! ఓ రామా ! పంతంతో సముద్రాన్ని బంధించవచ్చునా ! నీ

ప్రతాపాన్ని ఏమని ఎంతని కీర్తించేది ? అంటూ పల్లవిలో శ్రీరాముని గొప్పదనాన్ని తెలియజేయడం జరిగింది.

రామా ! రామా ! గొప్పనైన సంజీవని పర్వతం నీ బంటుచే తెప్పించావు. గొప్పనైన వాలిని ఒక్క బాణంతో చంపివేసినావు. ప్రకాశించగా శివుని విల్లును ఎక్కుపెట్టి విరిచినావట. పలుచనైన సీతమ్మను పెండ్లియాడినావట.

రామా ! రామా ! శరణన్న విభీషణుని వెంటనే రక్షించినావట. గొప్పనైన రావణుని చంపినావట. మామండలంలోని సముద్రాన్ని దాటివచ్చినావట. దేవతలు నిన్ను స్తోత్రం చేసినారట. నీ గొప్పదనమది ఎంతో ?

రామా ! రామా! లక్ష్మణుడు భరతుడు శత్రుఘ్నుడు నీకు తమ్ములట. నీగొప్పదనం జగత్తంతా నిండింది. నీవంతటా శ్రీమంతుడవు శ్రీవేంకటపర్వతం మీద నిలిచి కోరిన ఫలాల నన్నింటిని ఇస్తూవున్న కౌసల్యానందనుడవు. ప్రతి పాదం మధ్యలో చివరలో రామా ! రామా ! అనే పదాలనుపయోగించడం సంకీర్తనకు వన్నె చేకూరింది. రామ ! రామ ! అనే పదం ఆశ్చర్యాన్ని, గొప్పదనాన్ని, భక్తిని తెలియజేస్తున్నాయి.

## శ్రీరాముని భవ్యగుణాలు

అయోధ్యారాముడైన శ్రీరామచంద్రునికి నమస్కరిస్తూ ఈ సంకీర్తన వ్రాయడమైంది. శ్రీరాముని గుణగుణాలను, ఆయన మహనీయ గాథలను తెలియజేస్తూ సంకీర్తనలో అంతటా అన్ని పదాలను సంబోధన ప్రథమా విభక్తిలోని వాడుతూ శ్రీరాముడి గొప్పదనం వివరించబడిందీ సంకీర్తనలో.

రాగము : పాడి

పల్లవి : దేవ దేవోత్తమ తే నమో నమో
రావణ ! దమన ! శ్రీరఘురామా ! ॥ దేవ ॥

52

1. రవికులాంబుధి సోమ ! రామ ! లక్ష్మణాగ్రజ
భువిభరత శత్రుఘ్న పూర్వజ !
సవనపాలక ! కౌసల్యానందవర్ధన !
ధవళాబ్జనయన ! సీతారమణా ! ॥ దేవ ॥

2. దనుజ సంహారక ! దశరథ నందన !
జనక భూపాలక జామాత !
వినమిత సుగ్రీవ విభీషణ సమేత !
మునిజన వినుత ! సముఖ సుచరిత్ర ! ॥ దేవ ॥

3. అనిలజ వరద ! యహల్యాశాపమోచన !
సనకాదిసేవిత చరణాంబుజ !
ఘనతర శ్రీవేంకటగిరినివాస !
అనుపమోదా రవిహార ! గంభీరా ! ॥ దేవ ॥

అ.అ.సం.సం. 11 . 196

ఓ రామభద్రా ! నీవు దేవదేవోత్తముడవు. రావణున్ని అదుపులో పెట్టినవాడవు. శ్రీరఘురామునివి అలాంటినీకు నమస్కారం నమస్కారం అని రెండు మారులు చెప్పడమైంది.

ఓ రామా ! నీవు సూర్యకులం అనే సముద్రానికి చంద్రుని వంటి వానివి. లక్ష్మణునికి అన్నవు. భూమిపై భరత శత్రుఘ్నులకు కంటే కూడా నీవు మందు పుట్టినటువంటి వాడవు. యజ్ఞపాలకునివి. కౌసల్యకు ఆనందాన్ని కలిగించేవానివి. తెల్లకలువలవంటి కన్నులు గల్లిన వానివి. సీతారామణునివి అలాంటి నీకు నమస్కారం.

రాక్షసులను చంపినట్టివానివి. దశరథునికి కుమారునివి. జనక మహారాజు అల్లునివి. వినయవంతులైన సుగ్రీవ విభీషణులతో కూడిన మునిజనులతోడి సేవించబడిన వాడవు. మంచి ముఖం కల్గినవాడవు. చక్కటి నడవడిక కల్గిన వాడవు. అలాంటి నీకు నమస్కారం.

వాయుదేవుని కుమారుని కాపాడిన వాడవు. అహల్యా శాపాన్ని పోగొట్టిన వానివి. సనకుడు సనందుడు మొదలైన వారితో సేవింపబడిన పాదాలను కల్గినట్టి వానివి. ఘనతరమైన శ్రీవేంకటగిరిని నివాసంగా చేసుకొన్నవాడవు. సాటిలేని ఉదారభావాలతో విహరించే గంభీరునివి. అలాంటి నీకు నమస్కారం నమస్కారం అంటూ అన్నమయ్య శ్రీవేంకటగిరి రామున్ని నమస్కరిస్తూ ఉన్నాడు.

# శ్రీరాముని గుణగణాలు

ఈ సంస్కృత సంకీర్తనలో శ్రీరాముని భూరిగుణగణాలు వివరించబడ్డాయి. ఇందులో సంబోధన ప్రథమా విభక్తికి చెందిన పదాలే ఉన్నాయి. సంబోధన ప్రథమా విభక్తిలో మొత్తం సంకీర్తన వ్రాయడం అన్నమయ్యకు వెన్నతో పెట్టిన విద్య.

రాగము : లలిత

53

పల్లవి: నమో ! నమో ! జగదేకనాథ ! తర సర్వేశ !
విమల విశ్రుతలసద్విఖ్యాత కీర్తే ! ॥ నమో ॥

1. రామ ! రఘువర ! సితరాజీవలోచన !
భూమి జారమణ ! త్రిభువన విజయ !
కోమలాంగ శ్యామ ! కోవిద రణరంగ !
భీమ విక్రమ ! సత్య బిరుద ప్రవీణ ! ॥ నమో ॥

2. దలిత దైతేయ కోదండ దీక్షాదక్ష !
జలజాప్తకుల విభీషణురక్షక !
కలిత దశరథ తనయ కౌసల్యానంద !
సులభ వానరముఖ్య ! సుగ్రీవ వరద ! ॥ నమో ॥

3. చారులక్ష్మణ ! భరత శత్రుఘ్న పూర్వజ
తారక నిత్య బ్రహ్మస్వరూప
ధీర శ్రీవేంకటాధిప ! భక్త వత్సల !
భూరిగుణ సాకేతపుర నివాస ! ॥ నమో ॥

అ.అ.సం.సం. 11 . 199

జగత్తుకంతటి నాథుడా ! అందరికీ ఈశ్వరుడా ! మాలిన్యంలేక అంతటా వ్యాపించినట్టి చక్కగా పేరుగాంచినట్టి కీర్తిగల రామా ! నీకు నమస్కారం.

ఓ రాముడా ! రఘువంశం వారిలోకెల్లా శ్రేష్ఠుడా ! తెల్లపద్మముల

వంటి కన్నులు గలవాడా ! సీతా రమణుడా ! ముల్లోకాలలోను విజయాలను సంపాదించినట్టివాడా ! కోమలమైనట్టి నల్లనైనటువంటి అవయవాలను గల్గినట్టివాడా ! రణరంగంలో పాండిత్యసంప్రవీణుడా ! నీకు నమస్కారం.

దైత్యులను చీల్చినట్టి కోదండ దీక్షాదక్షుడా ! పద్మాలకు ఆప్తుడవైన సూర్యుని కులానికి చెందినవాడా ! విభీషణున్ని రక్షించినట్టి వాడా ! దశరథుని కుమారుడా ! కౌసల్యకు సంతోషాన్ని కల్గించేవాడా ! వానర ముఖ్యులకు సులభుడవైనట్టివాడా ! సుగ్రీవున్ని కాపాడినట్టివాడా ! నీకు నమస్కారం.

అందమైన భరత లక్ష్మణ శత్రుఘ్నుల కన్న ముందుపుట్టిన వాడా ! తారక నిత్య బ్రహ్మస్వరూపుడా ! ధీరుడైన శ్రీవేంకటపర్వతానికి నాథుడవైనట్టి వాడా ! భక్తవత్సలుడా ! గొప్ప గుణాలను కలిగినట్టి వాడ ! అయోధ్యాపురంలో నివసించేవాడా ! నీకు నమస్కారం నమస్కారం అని వేంకటగిరి రామున్ని నమస్కరిస్తున్నాడు అన్నమయ్య.

## శ్రీరాముని దివ్య ప్రభావం

శ్రీరాముని ప్రతాపము ఇందు వివరించబడింది. శ్రీమద్రామాయణం లోని కిష్కింధాకాండ, యుద్ధకాండలలో ఉన్న రాముని పరాక్రమం ఇందు స్పష్టం చేయబడింది. వాలివధ మొదలుకొని శ్రీరామ పట్టాభిషేకం వరకు అటుపై ఆ స్వామి తిరుమలపై వేంచేసిన విధాన్ని గూర్చి ఇందు తెలియజేయడం జరిగింది.

రాగము : పాడి

పల్లవి : ఎంత ప్రతాపము వాఁడు యెంతటి నేరుపరి
యెంతని పొగడవచ్చు నీరాముని ॥ ఎంత ॥

1. వాలినొక్క కోలనేసి వారిధి గట్టినవాఁడు
తాలిమితో సుగ్రీవుని లాలించినాఁడు
పాలించి విభీషణుని (బట్టముగట్టినవాఁడు
యేలుమని లంకకెల్లా నీరాముఁడు ॥ ఎంత ॥

54

2. కుచ్చివర (?) మొండెముగా కుంభకర్ణు (గొట్టినాడు
హెచ్చిరాకాసుల( జంపె నీరాముడు
తచ్చి రావణాసురుని తలలు చెండాడినా(డు
ఇచ్చకొల(దుల నిట్టె యీ రాము(డు ॥ ఎంత ॥

3. సీతతో విమానమెక్కి చేరి యయోధ్యకు వచ్చి
యీతల( బట్టమేలినా(డీ రాము(డు
శ్రీతరుణితో(గూడి శ్రీవేంకటేశు(డైనా(డు
యీతడే దరిసించరో యీ రాము(డు ॥ ఎంత ॥

అ.అ.సం.సం. 11 . 207

శ్రీరాముడో ఎంత ప్రతాపం గలవాడని, ఎంతో నేర్పరియని ఎన్ని విధాలుగానైన ఈ రామున్ని పొగడవచ్చునని పల్లవిలోని భావం.

వాలిని ఒక బాణంతో చంపి సముద్రానికి ఆనకట్ట కట్టినట్టి వాడు. స్నేహంతో సుగ్రీవునితో లాలించినట్టివాడు. విభీషణుని ఆదరించి పట్టాభిషేకం గావించినట్టివాడు. లంకా పట్టణానికి ఏలికైనట్టివాడు.

బాణముతో కుచ్చి శ్రేష్ఠమైన మొండెం గలవానిని కుంభకర్ణుని చేసినాడు. ఈ రాముడే విజృంభించి రాక్షసులను చంపినవాడు. అటుపై ముందుకు వెళ్ళి రావణుని తలలను చెండాడినట్టివాడు. ఈ విధంగా ఇష్టమొచ్చిన ప్రకారం శ్రీరాముడు నడచుకొన్నడు.

ఆ తర్వాత సీతతో విమానమెక్కి అయోధ్యవచ్చి పట్టాభిషేకం చేసుకొన్నట్టివాడు శ్రీరాముడు. ఆయనే శ్రీలక్ష్మితో కూడిన శ్రీవేంకటేశుడై వేంకటాద్రిపై వెలసినట్టివాడు. నాటి శ్రీరాముడే ఈ వేంకటేశ్వర ఈ స్వామిని దర్శించి తరించండి భక్తులారా ! అని అన్నమయ్య సందేశం.

## శ్రీరాముని దైవతత్వం

శ్రీరాముడు మానవులలో ఒకడు కాడని, అందరినీ రక్షించేవాడని,

ఆయన అందరికీ దేవుడని ప్రమాణ పూర్వకంగా అన్నమయ్య తెలియజేస్తున్నాడు. .అనేక వానర బలాలతో సముద్రానికి ఆనకట్టకట్టిన విధాన్ని, రావణుని మరియు రాక్షసులను చంపిన విధానాన్ని, లంకాపట్టణాన్ని సాధించిన విధానాన్ని తెలియజేస్తూ ఆయన మానవుడై వీటినన్నింటిని చేయలేడు. కావున ఆయన దేవుడే అని ఈ సంకీర్తనలో ఋజువు చేస్తున్నాడు అన్నమయ్య.

రాగము : లలిత

పల్లవి : సర్వరక్షకుఁడైన సర్వేశుఁడే కాక
ఉర్విమీఁదనందరిలో నొక్కఁడా రాముఁడు ॥ సర్వ ॥

**55**

1. కొండ పొడవులైన ఘోరవానరబలము
గుండుగా వారిధి దండ ఁగూడ ఁబెట్టి.
నిండుజటనిధిగట్టి నిగిడి లంక సాధించె
అండనే రాముఁడు నరుఁడన వచ్చునా ? ॥ సర్వ ॥

2. అన్నిటా దేవతలకు నసాధ్యమైన రావణు
నెన్నికగా ( బుత్ర మిత్ర హితుల తోఁడ
పన్ను కొన్ని శస్త్రాస్త్ర పంక్తులనె ఖండించె
సన్నుతినిట్టే రాముని జనుఁడన వచ్చునా ? ॥ సర్వ ॥

3. చలపట్టి లంక విభీషణునికి ఁబాలించి
బలువుగ సీతఁగూడి పట్టమేలి
ఇలలో శ్రీవేంకటాద్రి నిరవై లోకము గాచీ
నలువంక రాముఁడు నరుఁడన వచ్చునా ? ॥ సర్వ ॥

అ.అ.సం.సం. 11 . 208

అందరినీ రక్షించేవాడు. అందరికీ ప్రభువైన శ్రీరాముడు భూమిపైనున్న మానవులలో ఒకడా ? అని ప్రశ్నిస్తూ కాదని మిగిలిన మూడు చరణాలలో సమాధానాలనిస్తూన్నాడు.

అరణ్యంలో కొండలలో చాలా వరకు వ్యాపించిన ఘోరమైన వానర

బల సాయంతో గుండుగా నిండు సముద్రంపై వంతెన అనే దండను ఏర్పాటుచేసి లంకానగరాన్ని సంపాదించినవాడు. ఇంత గొప్పకార్యాన్ని సాధించిన రాముడు మానవుడా ! కాదని భావం.

అన్ని విధాల దేవతలతో కూడా ఎదురించడానికి సాధ్యంకాదని రావణుని ఎన్నుకొని కొడుకులతో స్నేహితులతో మేలుచేసే వారితో కూడిన ఆరావణుని శస్త్రాస్త్రాలతో పూనుకొని ఖండించినట్టి వాడు శ్రీరాముడు.

ప్రతిజ్ఞ చేసి విభీషణునికి లంకారాజ్యాన్ని యిప్పించి, లెక్కలేని బలంతో కూడి సీతతో కూడి అయోధ్యకు వెళ్ళి పట్టాభిషేకం చేసుకొని భూమండలంలో ప్రఖ్యాతిగాంచిన శ్రీవేంకటాద్రిని చేరుకొని నాలుగు దిక్కులతో కూడిన లోకాన్ని పాలించే శ్రీవేంకటేశ్వరుని రూపంలో నున్న శ్రీరాముడు నరుడా ! కానేకాదని అన్నమయ్య సిద్ధాంతం.

## శ్రీరాముని విజయాలు

శ్రీరాముడు సాధించిన లంకా విజయాన్ని అట్లే ఇతర విషయాలలో ఆయన సాధించిన ప్రగతిని పూస గ్రుచ్చినట్లుగ ఈ సంకీర్తనలో తెలియజేస్తున్నాడు అన్నమయ్య. ఇందుపయోగించిన పదాలన్నీ ప్రథమా విభక్తి ఏకవచనాలే. ఇందలి ప్రత్యేకత ఏమనగా శ్రీరాముడు సాధించిన కార్యాలను త్రేతాయుగంలో ప్రత్యక్షంగా ఉండి తాను చూసినట్లే వ్రాయడం.

రాగము: మాళవి గౌళ

పల్లవి : అదెలంక సాధించె నవని భారము దించె
విదితమై ప్రతాపము వెలయించె నితఁడు ॥ అదె ॥

1. రవివంశ తిలకుఁడు రాముఁడితఁడు
భువిఁబుట్టె దశరథ పుత్రుఁడితఁడు
భవుఁడెంచెఁ దారక బ్రహ్మ మీతఁడు
పవనజుకిచ్చినాడు బ్రహ్మపట్టమీతఁడు ॥ అదె ॥

56

2. బలువుడు సీతాపతి యీతడు
తలకొన్న వాలిమర్దనుడితడు
విలసిల్లె నేకాంగ వీరుడితడు
చలమరి కోదండదీక్షాగురుడితడు ॥ అదె ॥

3. శరణాగత వజ్ర పంజరుడీతడు
సరిలేని యసుర భంజకుడీతడు
వరదుడు శ్రీవేంకటేశ్వరుడితడు
అరయ విజయనగరాధీశుడితడు ॥ అదె ॥

అ.అ.సం.సం. 11 . 219

అదిగో ! శ్రీరాముడు లంకాపట్టణాన్ని సాధించినాడు. భూమిపై నున్న భారాన్ని దించినాడు. ఇతని ప్రభావం అందరికీ తెలిసినట్టిదై ప్రకాశిస్తూ ఉంది.

ఇతడు శ్రీరాముడు రఘువంశతిలకుడు. భూమిపై పుట్టిన దశరథ పుత్రుడితడు. ఈయన తారక బ్రహ్మం. హనుమంతునికి రాబోవు కల్పంలో బ్రహ్మపదాన్నిచ్చినాడు.

బలవంతుడైన ఈ సీతాపతి ఎదురు తిరిగిన వాలి మదాన్ని అణచినట్టివాడు. ప్రకాశించిన ఏకాంగ వీరుడీయనే. పేరుగాంచిన కోదండ దీక్షాగురుడితడే.

శరణాగత వజ్రపంజరుడీయనే. సాటిలేని రాక్షసులను నశింపజేసేడితడే. వరాలనిచ్చే శ్రీవేంకటేశ్వరుడు. తెలునుకొనగా ఈయనే విజయనగరాధీశ్వరుడీయనే. ప్రతిపదం నందును ఇతడు అని ప్రత్యేకంగా నిర్దేశించి చెప్పడం సంకీర్తనకు బలం చేకూర్చింది.

## భక్తులప్రశంసలు

వివిధ గుణాలతో అలరారే రామున్ని అనేక విధాలుగా పూజించండని తెలియజేస్తూ శ్రీరాముని గుణగుణాలను తెలియజేస్తున్నాడు.

రాగము : రామక్రియ

పల్లవి : రాముఁడు లోకాభిరాముఁడు నీఁడిగో
వేమారు మొక్కుచు సేవించరో జనులు ॥ రాము ॥

57

1. చెలువపు రూపమున జితకాముఁడు
మలసీ బిరుదున సమరభీముఁడు
పొలుపైన సాకేత పురధాముఁడు
ఇలలోఁ బ్రజలకెల్లా హితధాముఁడు ॥ రాము ॥

2. ఘనకాంతుల నీలమేఘశ్యాముఁడు
అనిశము నుతుల సహస్రనాముఁడు
కనుపట్టు కపినాయక కస్తోముఁడు
తనునెంచితే దేవతా సార్వభౌముఁడు ॥ రాము ॥

3. సిరుల మించిన తులసీదాముడు
కరుణానిధియైన భక్తప్రేముడు
ఉరుతర మహిమల నుద్దాముడు
గరిమల శ్రీవేంకటగిరిగ్రాముడు ॥ రాము ॥

అ.అ.సం.సం. 11 . 220

రాముడు ఇదిగో ! లోకాభిరాముడు ఈయనే ! ఓ జనులారా ! వేలకొద్ది సార్లు మ్రొక్కుచూ సేవించండి.

అందమైన రూపంలో ఉండి ఇంద్రియాలను జయించినట్టి వాడు. పరిశీలించి చూచినట్లైతే శౌర్యంలో సమరభీముడు అందమైనసాకేతపుర నివాసి.

గొప్పనైన కాంతులతో కూడుకొన్న నీలమేఘశ్యాముడు. ఎల్లప్పుడు వేయి పేర్లతో కీర్తింపబడేవాడు. కనిపించే కపినాయిక స్తోముడు. ఎంచగా తాను దేవతా సార్వభౌముడు.

సంపదలలో మించిన తులసీదాముడు కరుణానిధియైన భక్త ప్రేముడు. గొప్పనైన మహిమలతో గొప్పనైన వాడు. గొప్పదనాలలో శ్రీవేంకటగిరిధాముడు.

ఇట్టివానిని వేనోళ్ళకొనియాడండి జనులారా ! అని తెలియజేస్తున్నాడు. ఈ సంకీర్తనలోని అన్ని చివరిపదాలు ప్రథమాంతములే.

## అన్నమయ్య ద్వారా సైనికులకు ప్రోత్సాహం

ఈ సంకీర్తన అనేక ధ్వన్యనుకరుణ శబ్దాలతో కూడి వీరరస ప్రబోధకంగా ఉంది. యుద్ధంలో పాల్గొనే సైనికులలోని వీరావేశాన్ని పెంపొందించటానికి గాను ఈ రోజుల్లోకూడా ఇలాంటి పాటలను సైనికులు పాడుకొంటూ ఉన్నారు. ఇదే పద్ధతిలో అన్నమయ్య తన ఇష్టదైవమైన శ్రీరామున్ని వానర సైన్యాన్ని ప్రోత్సహించి తాను తన ఇష్ట దైవమైన శ్రీరాముని వానర సైన్యాన్ని ప్రోత్సహించి తాను ఆ కాలంలో ఉండి సైనికుల్లో వీరావేశాన్ని రగుల్కొల్పినట్లు భావించి ఆనందించాడు.

రాగము : సాళంగనాట

పల్లవి జయము మనది వనచరులాల !
రయమున ధర్మదారలు తుత్తూతూ || జయ ||

1. రక్కసుల మీద రాముఁడలిగె నలు
దిక్కుల నడవుడు తిడిం తిడిం
యొక్కుఁడు సేనను [illegible]టు మొరయింపుఁడు
ఢక్కా వినదము ఢమఢమ ఢమం || జయ ||

58

2. కుటిల దానవులఁగొట్టుఁడు కోటలు
తటకున దాఁటుఁడు ధణం ధణం
పటుగతి నార్చుచు పట్టుఁడు లగ్గలు
పెటులు చూఁడుఁడదె పెటపెట పెటల్ || జయ ||

3. గుట్టున నుండక కూచె రావణుఁడు
పట్టుఁడు సంకులు భం భం భం
యిట్టె శ్రీవేంకటేశుఁబు గెలిచెనుస
దిట్టలై యాడుఁడు ధిం ధిం ధిం || జయ ||

అ.అ.సం.సం. 11. 222

వనాల్లో నివసించే వానరులారా ! జయం మనదే. వేగంగా తుత్తూతూ అని మంగళ వాద్యాలను మ్రోగించండి.

శ్రీరాముడు రాక్షసుల మీద అలిగినాడు. తిడిం తిడిం అని అన్ని దిక్కులలో నడువండి. ఎక్కువగా నున్న సేనను ఇక్కడికి మరలించండి. ఢమ ఢమ ఢమయని డక్కను వాయించండి.

మోసగాళ్లైన దానవులను చంపండి. ధణం ధణం అని కోటలు తటుక్కున దాటండి. వేగంగా కోటను ప్రాకుటకు త్రాళ్ళుపట్టండి. అదిగో పెటపెట పెట ధ్వనులు వినుపిస్తున్నాయి.

దాపులో నుండక వచ్చిన రావణుడు నేలకూలినాడు భం భం భం అని శంఖాలు పూరించండి. శ్రీవేంకటేశ్వరుడు గెలిచినాడు. ధిం ధిం ధిం అని మిక్కిలి బలవంతులై ఆడుకోండి అని సైన్యంలో నూతనోత్సాహాన్ని పెంపొందించు చున్నాడు అన్నమయ్య. ఎప్పుడో జరిగిన యుద్ధగాథను దృష్టిలో ఉంచుకొని తాను అందు ప్రత్యక్షంగా ఉండి వానర సైన్యానికి ప్రోత్సాహాన్నిస్తున్నట్లుగా అనుభూతినొందుతున్నాడు. తుత్తూతూ, తిడిం తిడిం, ఢమ ఢమ, ధణ ధణ, పెట పెట, భం భం భం, ధిం ధిం ధిం అనే ధ్వన్యనుకరణశబ్దాలు వానరులలో వీరరసాన్ని పెల్లుబుకజేస్తున్నట్లున్నాయి.

## రావణ సంహారం

శ్రీరాముడు రాక్షస సంహారం గావించినపుడు కులపర్వతాలు భూమండలం, జగత్తు, సముద్రాలు ఎలా కంపించింది తెలియజేశాడు పదకర్త. రావణుని చంపినపుడు ప్రకృతి వైపరీత్యాలను ప్రజలకు గలిగిన శుభాన్ని ఈ సంకీర్తనలో అన్నమయ్య రమణీయంగా తెలిపినాడు.

రాగం : శంకరాభరణం

పల్లవి : వినుడిదె రఘుపతి విజయములు
పనుపడి రాక్షసబాధలుడిగెను

# 59

1. కులగిరులదరెను కుంభిని వడకెను
ఇల రాముడు రథమెక్కినను
కలగె వారిధులు కంపించె జగములు
బలు విలునమ్ములు పట్టినను ॥ విను ॥

2. పిడుగులు దొరిగెను పెనుగాలి విసరె
తొడిబడ బాణము దొడిగినను
ముడివడె దిక్కులు మొగ్గె దిగ్గజములు
యెడపక రావణునేసినను ॥ విను ॥

3. చుక్కలు డుల్లెను స్రుక్కె భూతములు
తొక్కి యసురతల గుంచినను
గక్కన శ్రీవేంకటగిరి నిలువగ
అక్కజమగు శుభమందరి కొదవె ॥ విను ॥

అ.అ.శృసం.సం. 11 . 223

జనులారా ! రఘుపతి విజయాలను గూర్చి వినండి. ఆయన విజయాల రాక్షస బాధలు తొలగిపోయినాయి.

శ్రీరామచంద్రుడు రథం ఎక్కినపుడు హిమాలయం వింధ్యం, గంధమాదనం మొదలైన ఏడు పర్వతాలు అదిరినాయి. భూమి వణికింది. ఆయన విల్లంబులు పట్టినపుడు సముద్రాలు పొంగాయి. జగాలు కంపించాయి.

ఆయన రావణునిపై బాణాలు వదిలినప్పుడు పిడుగులు పడ్డాయి. పెనుగాలులు వీచాయి. దిక్కులు ముడివడ్డాయి. దిగ్గజాలు వంగినాయి.

రావణుని తల నరికినప్పుడు చుక్కలు నేలరాలాయి. భూతాలు స్రుక్కినాయి. ఆ తర్వాత శ్రీరాముడే శ్రీవేంకటగిరిపై నిలువగా ఆశ్చర్యమైన శుభం అందరికీ కల్గింది.

# వాల్మీకి వైభవం

రామునిజన్మవల్ల శ్రీమద్వాల్మీకికి కలిగిన లాభం, మారీచుని కర్మ శుర్పణఖ బాధ, రాక్షస స్త్రీల వైధవ్యం, ఖరదూషణులు మొదలైన వారి మరణం మండోదరి గండం మొదలైన అంశాలను ఎంతో రమణీయంగా ఈ సంకీర్తనలో తెలియజేసినాడు అన్నమయ్య.

రాగము : మాళవిగౌళ

పల్లవి : రాముఁడు లోకాభిరాముఁడుదయించఁగాను
భూమిలో వాల్మీకికి పుణ్యమెల్లా దక్కెను ॥ రామ ॥

60

1. తటుకు మారీచుని తలపైఁబోయఁ గర్మము
కుటిల శూర్పణఖ ముక్కునఁబండెను
పటుకున (దెగె దైత్యభామల మెడతాళ్ళు
మటుమాయ దైత్యులకు మరి నూరూనిండెను ॥ రామ ॥

2. తరగె రావణు పూర్వ తపముల యాయుష్యము
ఖరదూషణాదులకు కాలము దీగె
గరిమ లంకకు నవగ్రహములు భేదించె
సిరుల నింద్ర జిత్తుకు చినిఁగె నంతటను ॥ రామ ॥

3. పొరిఁ గుంభకర్ణునికి పుట్టిన దినము వచ్చె
మరలి గండము దాఁకె మండోదరికి
పరగె (గ?) నయోధ్యకు భాగ్యములు ఫలియించె
చిరమై శ్రీవేంకటేశుచేఁతలెల్లా దక్కెను ॥ రామ ॥

అ.అ.సం.సం. 11 . 225

లోకాభిరాముడైన శ్రీరాముడదయించగా భూమండలంలో వాల్మీకికి పుణ్యమంతా దక్కింది.

మారీచుని తలపై బడవల్సినకర్మ తటుకున కుటిలమైన శూర్పణఖ ముక్కు పండింది. ఈ కారణంగా రాక్షసస్త్రీల మంగళసూత్రాలు పటుక్కున తెగిపోయినాయి. మిక్కిలి మాయలు గల రాక్షసులకు నూరేళ్ళూ నిండినాయి.

రావణుడు ముందుచేసిన తపస్సుకు కాలం చెల్లింది. ఖరుడు దూషణుడు మొదలైన వారి ఆయుస్సు తీరిపోయింది. గొప్పనైన లంకకు నవగ్రహాలు భేదించాయి. సంపన్నుడైన ఇంద్రజిత్తుకు చావు మూడింది.

కుంభకర్ణునికి పుట్టిన దినం వచ్చింది. మండోదరికి గండ మొచ్చిపడింది. అయోధ్య భాగ్యాలు ఫలించినాయి. శ్రీవేంకటేశ్వరుని చేతలెల్లా మనకు చిరకాలం దక్కాయి అని ధ్వని యుక్తంగా భావగర్భితంగా అన్నమయ్య చెప్పినాడు.

## భక్తుల ఆనందం

రావణుని మరణానంతరం దేవతలు ఎలా సంతోషించినారు ? రాక్షసులు ఎలా పారి మృతిచెందినారు ? శ్రీరాముని సైన్యంలోని వీరుల బల పరాక్రమాలెలా ఉన్నాయి ? వాటి ధాటికి రాక్షసులేమయ్యారు ? అనే అంశాలకు ఈ సంకీర్తనలో చక్కటి సమాధానాలున్నాయి.

రాగము : సామంతం

పల్లవి : సమసె రావణుఁడు సమరము లోపల
అమరులు కడు ముదమందిరి మెరసి ॥ సమ ॥

61

1. బెరగిరి రాముని శరముల కసురలు
సురిగిరి పోట్ల చురుకునను
తొరిగిరి నెత్తుట (దునియలు సేసిన
తిరిగిరి తరుసుఁగ దిక్కులకు ॥ సమ ॥

2. కూలిరి భల్లూకుల ఘోషమేలరే
వాలిరి వాయుజవాల హతి

వీలిరి యంగదు వివిధ నాదముల
తూలిరి సుగ్రీవు దోర్బలమునను ॥ సమ ॥

3. దాఁగిరి లక్ష్మణుదాకకు నులుకుచు
వీఁగిరి వనచరవితతికిన
పాఁగి శ్రీవేంకటపతి కృపారసమునఁ
దోఁగిరి జనులు సంతోషంబునను ॥ సమ ॥

అ.అ.సం.సం. 11 . 228

యుద్ధంలో రావణుడు మరణించాడు. రావణుడు మరణించి నందుకు దేవతలెంతో ప్రకాశంతో సంతోషించినారు.

శ్రీరాముని బాణాలకు రాక్షసులు బెదిరినారు. బాణపు పోటులకు క్రిందికి కూలినారు.నెత్తుటి దేహపుముక్కలు పడినందున దిక్కులకు తరుమగా తిరిగి పోయారు.

జాంబవంతుని ఎలుగుభంట్లు శబ్దాలకు, హనుమంతుని తోకధాటికి, అంగదుని రకరకాల శబ్దాలకు సుగ్రీవుని భుజబలాలకు కూలి, వాలి, వీలి, తూలినారు రాక్షసులు.

లక్ష్మణుని దాకకు ఉలుకుచూ, వానరసేనా సమూహానికి దాగి వీగినారు. శ్రీవేంకటపతి దయారసానికి పాత్రులైనారు జనులు సంతోషం గల్గిన వారైనారు.

## రామాయణ ఫలితం

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరస్వామి భక్తుడు. అయితే ఈ సంకీర్తనలో ఆయన శ్రీరామసంకీర్తన చేసినాడు. శ్రీవేంకటేశ్వరునికి శ్రీరామ చంద్రునికి మధ్య భేదమెఱుగని వాడు. ఆయన శ్రీరాముని గొప్పదనాన్ని సంకీర్తన రూపంలో చెప్పలనుకున్నాడు. ఆయనకు రామాయణం గుర్తొచ్చింది. శ్రీమద్రామాయణం 24 వేల శ్లోకాలతో కూడి ఉంది. దాన్నంతా సామాన్యజనులకు చెప్పాలంటే ఏండ్లు బూండ్లు పడుతుంది. చెప్పక ఊరుకోలేడు. మొత్తం రామాయణాన్నంతా

ఒకే సంకీర్తనలో చెప్పాలనుకున్నాడు. రామాయణ మాహాత్మ్యాన్ని, రామకథను 11 వాక్యాలలో చెప్పిమనలను ఆశ్చర్యంలో ముంచెత్తి రామకథను సామాన్య జనానికి కూడా సులభంగా అర్థమయ్యేటట్లు ఇందు తెలియజేశాడు.

రాగము : బౌళి రామక్రియ

పల్లవి : ఇతఁడే పరబ్రహ్మ మిదియె రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము ॥ ఇతడే ॥

1. ధరలో రాముఁడు పుట్టె ధరణిజఁ బెండ్లాడె
అరణ్యవాసులకెల్లా నభయమిచ్చె
సారిది ముక్కుఁజెవులు చుప్పనాతినిగోసె
ఖర దూషణులను ఖండించి వేసె ॥ ఇతడే ॥

62

2. కినిసి వాలిఁ జంపి కిష్కింధ సుగ్రీవుకిచ్చె
వనధి బంధించి దాఁటె వానరులతో
కనలి రావణ కుంభకర్ణాదులను జంపి
వనితఁజేకొని మళ్ళి వచ్చె నయోధ్యకును ॥ ఇతడే ॥

3. సౌమిత్రియు భరతుఁడు శత్రు ఘ్నుఁడు గొలువఁగ
భూమి యేలె కుశలవ పుత్రుల గాంచె
శ్రీమంతుఁడై నిలిచె శ్రీవేంకటాద్రిమీఁద
కామించి విభీషణు లంకకుఁబట్టము గట్టె ॥ ఇతడే ॥

అ.అ.సం.సం. 11 . 224

శ్రీరాముడు పరబ్రహ్మమని రామకథ లోకాంతరాలలో శతకోటి శ్లోకాలతో కూడి ఉందని, ఈ కథ పుణ్యఫలమని పల్లవిలో తెలియజేసినాడు.

భూమండలంలో శ్రీరాముడు పుట్టినాడని సీతను పెండ్లి చేసుకున్నాడని, ఆ తర్వాత అరణ్యానికి వెళ్ళి మునులకు అభయమిచ్చినాడని, తనను ప్రేమించ వచ్చిన శూర్పణఖ ముక్కు చెవులు కోసి ఖరదూషణుడు మొదలైన వారిని చంపినాడని, బాలఅయోధ్య అరణ్య కాండలకు చెందిన మొత్తం కథను నాలుగు పాదాలలో చెప్పినాడు.

ఆ తర్వాత వాలిపై కోపించి కిష్కింధను సుగ్రీవునికిచ్చి సముద్రానికి ఆనకట్ట కట్టినాడని వానరులతో కలిసి రావణుడు, కుంభకర్ణుడు మొదలైన వారిని చంపి విభీషణునికి పట్టం కట్టి, తిరిగి సీతను అయోధ్యకు తెచ్చినాడని కిష్కింధ, సుందర, యుద్ధకాండలకు చెందిన కథలను నాలుగు పాదాలలోనే చెప్పినాడు. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు కొలువగా చాలాకాలం భూమిని ఏలినాడని, కుశలవులనే పుత్రులను పొందినాడనీ ఉత్తరకాండ సారాన్ని తెలియజేసి అలనాటి శ్రీరామచంద్రుడు ఇప్పుడు శ్రీవేంకటాద్రిపర్వతం మీద శ్రీమంతుడై నిలిచియుండి సేవలందు కొంటున్నాడని మొత్తం రామాయణాన్ని కట్టెనొట్టు తెచ్చే అని చాలా సరళంగా తెలియజేసినాడు అన్నమయ్య.

## రాక్షసులను బెదరింపు

ఈ లోకంలో శ్రీ మహావిష్ణువు శ్రీరాముడై జన్మించినాడని ఆయన బాణాలు తిరుగులేవని ఆయన సముద్రానికి ఆనకట్ట కట్టి రావణున్ని చంపాడని కాబట్టి ఓ రాక్షసులారా ! మీరు విభీషణుని వలె శ్రీవేంకటేశ్వరుని శరణువేడితే ఆయన మిమ్ములను రక్షించగలడని రాక్షసులకు దారిచూపుతున్నాడు అన్నమయ్య.

రాగము: నాట

పల్లవి : అదె వచ్చె రాఘవుఁడాతని దాడిముట్టె
యెదిరించరాదు మీకు నేది దెరువిపుడు ॥ అదె ॥

1. భువిలోన రాముఁడై పుట్టెనట విష్ణుఁడు
అవల మీకు దిక్కేది యసురలాల !
తివిరి మిమ్ము వెదకె దివ్యబాణాలాతనివి
రవళినెందుచొచ్చేరు రాకాసులాల ! ॥ అదె ॥

63

2. చలపట్టి కొండలచే సముద్రముగట్టెనట
తలచూపరాదు మీకు దైత్యులాల !
వలగొని దేవతలు వానరులై వచ్చిరట
నిలువరాదిక మీరు నిశాచరు లాల ! ॥ అదె ॥

3. రావణు జంపెనట రణములోఁజిక్కించుక
దావతి బారరో మీరు దానవులాల !
యీవేళ శ్రీవేంకటేశుఁడితఁడే విభీషణుని
లావున శరణనరో లంకావాసులాల ॥ అదె ॥

అ.అ.సం.సం. 11 . 235

అదిగో ! రఘువంశంలో పుట్టిన శ్రీరాముడు వచ్చినాడు. అతడు చుట్టిముట్టినాడు ఆయనను ఎదిరించడానికి శక్యం కాదు. మీకు మార్గమేది? ఇప్పుడు? అని శత్రువులను ప్రశ్నిస్తున్నాడు.

ఓ రాక్షసులారా ! విష్ణువు భూమిలో రాముడై పుట్టినాడట. అవతల మీకు దిక్కేది ? ఆయన బాణాలు ప్రయత్నించి మిమ్ములను వెదకేవి. శబ్దం చేస్తూ మీరెక్కడ ప్రవేశించగలరు?

ప్రయత్నించి కొండలలో సముద్రానికి ఆనకట్టకట్టినాడట . ఓ రాక్షసులారా ! మీరిక కన్పించరాదు. దేవతలే వానరుల వచ్చినారట. రాత్రులందు తిరిగే రాక్షసులారా ! మీరింక ఇక్కడ నిలువరాదు.

యుద్ధంలో చిక్కించుకొని రావణున్ని చంపినాడట. ఓ లంకాపుర రాక్షసులారా ! మీరు వేగంగా పారిపొండి. ఇదిగో శ్రీవేంకటాచలంపై శ్రీరాముని రూపంలో ఉన్న వేంకటేశ్వరున్ని విభీషణునివలె ఆయనను శరణు వేడండి. ఆయన మిమ్ములను రక్షించగలడని అన్నమయ్య రాక్షసులకు బెదురు పుట్టిస్తున్నాడు. తాను ఆనాటి యుద్ధంలో శ్రీరాముని తరపున పాల్గొని రాక్షసులను బెదిరించుచున్నట్లుంది. ఆహా ! ఏమి భావన ! ఎంత తన్మయత్వం ? ఆయనలో శ్రీవేంకటరాముని మీద ఎంత భక్తో !

## శ్రీరామానుయాయులకు విన్నపం

రావణుని చంపిన తర్వాత శ్రీరాముడు అయోధ్యకు వెళ్ళి పట్టాభిషేకం చేసుకొన్నాడు. ఆ సందర్భంలో అన్నమయ్య దేశదేశాలలోని రాజ రాజులను వసిష్ఠ వామదేవులను, భరత -లక్ష్మణ- శత్రుఘ్నులను, సుగ్రీవాంగద హనుమంతులను

ఆయా కార్యాలను చేయండని పురమాయిస్తూ శ్రీరాముని రూపమైన శ్రీవేంకటేశ్వరుని ఎడల భక్తులు ఎలా ఉండాలో తెలియజేస్తున్నాడు అన్నమయ్య.

రాగము: సాళంగనాట

పల్లవి : సముఖా అవధారు సర్వేశ ! రాఘవేంద్ర
అమరులు వారివో చిత్తావధానా ! ॥ సము ।

# 64

1. రాముఁడు గొలువున్నాఁడు రాజులాల కొలువుఁడు
వామదేవ సేవించు వసిష్ఠికను
సామజముల వారవో జవనాశ్వములవార
మీ మీ పౌజులతో నిరుమేలా నిలువర ! ॥ సము ।

2. భరత గొడుగువట్టు బాగా లిమ్ము శత్రుఘ్న
సరుస లక్ష్మణుఁడ వింజామురిడుము
సొరిది నిలుచుండుడు సుగ్రీవాంగదులాల
వెరపుతో విభీషణ విన్నపాలు సేయనో ॥ సము ।

3. వానరులాల, మొక్కుఁడు వాయుజపాదములొత్తు
నానాదేశాధీ శులాల కానుక లిండు
పూని శ్రీవేంకటాద్రిపై ఁబొంచి సీతాసమేతుఁడై
శ్రీనిధియై వరాలిచ్చీ చేకొనరో ప్రజలు ॥ సము ।

అ.శృం.సం.సం. 18 . 527

మంచి ముఖం గల సర్వేశుడా ! రాఘవేంద్రా ! దేవతలిరుగో ! మనస్సున ఏకాగ్రతను నిలిపి వారి మాటలను అవధరించండి.

శ్రీరాముడు అయోధ్యలో కొలువున్నాడు. రాజులారా ! ఆయనను సేవించండి. వసిష్ఠా ! వామదేవ ! శ్రీరాముని సేవించండి. మదగజాలతో జవనాశ్వాలతో మీమీసైన్యాలతో ఇరువైపులా నిలువండి.

భరతుడా ! గొడుగు పట్టు. శత్రుఘ్నా ! కర్పూర హారతులిమ్ము.

లక్ష్మణా ! వింజామరతో వీచు. సుగ్రీవాంగదులారా ! మీరు నిలువండి. విభీషణా ! భయంతో నిలబడి విన్నపాలు చేసుకో.

వానరులారా ! మీరు శ్రీరామునికి మ్రొక్కండి. వాయు కుమారా ! నీవు శ్రీరాముని పాదాలొత్తు. నానాదేశాలలో నివసించే రాజులారా ! మీరు కానుకలందజేయండి. ఆ అయోధ్యారాముడే ఈనాడు వేంకటాద్రిపై సీతాసమేతుడై నిలుచొని ఉన్నాడు. ప్రజలారా ! ఆయన శ్రీనిధియై కరాలిస్తూ ఉన్నాడు. ఆయన చేతిని ఆలంబనంగా ఉంచుకోండి అంటూ ఒక్కొరికి ఒక్కొక్క పనిని పురమాయిస్తూ తానొక చక్కటి కార్యనిర్వాహకుడనని తనే సుమంత్రుడంతటి వాడనని పదకర్త స్వయంగా నిరూపించుకొంటున్నాడు.

## శ్రీరాముని అద్భుతాలు

సీతమ్మ శ్రీరామచంద్రునితో ప్రభూ ! నీవు రాజువైనావు ? ఎన్నెన్నో ఘనకార్యాలను చేసినావు. ఆనకట్టను కట్టి యౌవనాన్ని జయించినావు. చివరకు నిన్ను నేను కూడినాను అని తన సంతోషాన్ని చెప్పిన వైనాన్ని అన్నమయ్య తెలిపినాడు.

రాగం : దేవగాంధారి

పల్లవి: రాజువు నీకెదురేది రామచంద్ర !
రాజీవనయనుఁడ రామచంద్ర ! ॥ రాజు ॥

1. వెట్టిగాదు నీవలపు వింటి నారికిఁదెచ్చితివి
అట్టుఁసేయఁబనిలేదు యిట్టె రామచంద్ర !
వెట్టుమఱవఁగవచ్చునివి రామచంద్ర ! ॥ రాజు ॥

65

2. బలిమి తోడుఁతఁ బైఁడి పతిమెగ్గైకొంటిది
రతికెక్కె నీచలము రామచంద్ర !
మితిమీరి జవ్వనము మీఁదుకట్టితివి నాకై
యితరులేమనఁగల రిఁక రామచంద్ర ! ॥ రాజు ॥

3. నా వంటి సీతను నా (గేటికొన(దెచ్చితి
రావాడి తమకముతో రామచంద్ర
యీ వేళ శ్రీవేంకటాద్రి నిరవై నిన్ను (గూడితి
చేవదేర గండికోట శ్రీరామచంద్ర ! ॥ రాజు ॥

అ.అ.సం.సం. 25 . 165

పద్మాలవంటి కన్నులుగల ఓ రామచంద్రా ! శ్రీరామచంద్రా ! నీవు రాజువయ్యావు. నీకు ఎదురు లేదు అంటూ శ్రీరామునికి ఆహ్లాదాన్ని కల్గిస్తున్నాడు పదకర్త.

రామచంద్రా ! నీ వలపు వ్యర్థం కాదు. వింటినారికే సీతను తెచ్చినావు. ఇట్టే అట్టడి సేయపనిలేదు. గుట్టుతో సముద్రం మీద కొండలను పరచి ఆనకట్ట కట్టినావు. ఈకార్యలను ఎలా మరిపించవచ్చు ?

రామచంద్రా ! బలంతో బంగారు బొమ్మను చేశావు. నీ చలం రతికెక్కింది. మితిమీరి నా కొఱకై యౌవనానికి అడ్డుకట్టవేసినావు. ఇతరులిక నిన్నుఏమనగలరు ?

ఓ గండికోట రామచంద్రా ! రావాడితమకంతో నా వంటి సీతను నాగేటి కొనతో తెచ్చినావు. ఈ రోజు శ్రీవేంకటాద్రి పర్వతంపై ఇరవుగనిన్నుకూడినావు అని సీతమ్మ శ్రీరామునితో అంటున్నట్లుగ అన్నమయ్య తెలిపినాడు.

## శ్రీరాముని సాహసాలు

శ్రీరాముని సాహసాలు ఇందు వర్ణింపబడ్డాయి. ఎన్నిసార్లు వర్ణించలేదు ఈ సాహసాలను, ఒక్కొక్కరాగంలో కొన్నికొన్నిసామసాలు, చెప్పినవే చెప్పినా చెప్పేవిధం, పాడేవిధం వేరు. ప్రతిరాగంలో తన వేంకటరాముని సాహసాలను వర్ణించాలని ఉబలాట పడుతూ ఉంటాడు అన్నమయ్య.

రాగము: సాళంగనాట

పల్లవి: అరుదు రాముని చేఁత లదిగో పుష్పకమును
సారిది మనబాలుతే సోద్యము గదమ్మ ! ॥ అరు ॥

66

1. హరుని విల్లు విరిచె అట్టె సీతఁ బెండ్లాడె
పరశురాముని బాహుబలముగొని
సురలకు మునులకు సారిది నభయమిచ్చె
వరుస నయోధ్య యేలవచ్చెనటవమ్మా ! ॥ అరు ॥

2. వాలిఁగొట్టి సుగ్రీవు వరరాజ్యమిచ్చెనట !
చాలుగా ఁగొండలని జలధిగట్టె !
తీలుగా రావణుఁజంపి తెగిలంక సాధించి
వాలిన సేనలఁగూడి వచ్చినటవమ్మా ॥ అరు ॥

3. కాంతమైన సీతఁగూడి కలుషము లెల్లఁబాపి
పంతముతో విభీషణుఁబట్టము గట్టి
ఇంతటా శ్రీవేంకటాద్రి నిరవున వేఁటలాడి
వంతులకు రాజ్యమేలవచ్చెనటవమ్మా ॥ అరు ॥

అ.అ.సం.సం. 25 . 495

శ్రీరాముని చేష్టలు అవిగో ! ఆ చేష్టలు అరుదైనవి. అదిగో పుష్పకం. ఈ విమాన సంపాదనం అరుదైనదిగా క్రమంగా దీనిని సంపాదించింది మన బాలులే. ఈ సంపాదన చాలా వింత.

ఓ అమ్మా! శ్రీరాముడు ఈశ్వరుని విల్లు విరిచినాడు. అట్లే సీతను పెండ్లాడినాడు. పరశురాముని బాహుబలాన్ని గ్రహించినట్టివాడు. క్రమంగా మునులకు దేవతలకు అభయమిచ్చినట్టివాడు.

క్రమంగా ఓ అమ్మా! శ్రీరాముడు వాలిని చంపి సుగ్రీవునికి శ్రేష్ఠమైన రాజ్యాన్నిచ్చి నట్టివాడు. కొండలనే వరుసగా వేసి ఆనకట్ట కట్టినట్టివాడు. తగ్గిన రావణున్ని చంపి తెగి లంక సాధించి గెలిచిన సేనలతో కూడి వచ్చినట్టివాడు.

ఓ అమ్మా ! కాంతయైన సీతతో కూడి కలుషాలన్నింటిని పోగొట్టి ప్రతిజ్ఞలతో విభీషణునికి పట్టాభిషేకం చేయించి శ్రీవేంకటాద్రిపై ఇరవున వేటలాడి వంతులకు రాజ్యమేలడానికి వచ్చినట్టివాడు. ఈ సంకీర్తనలో అయోధ్యాపుర స్త్రీలు కౌసల్యతో చెప్తున్నట్టుగా ఉంది.

## సీతమ్మ ఆనవాల్లను హనుమంతుడు చూపించడం

రావణుడపహరించిన సమయంలో సీతమ్మ తన వెళ్ళానో తెలుపడానికోసం తన బంగారు నగలను చీర చెంగు మూటగా కట్టి ఋష్యమూకపర్వతం వద్ద నున్న వానరులవద్ద వేసింది. ఆ తర్వాత శ్రీరాముని పనుపున లంక వెళ్ళి అక్కడ సీతమ్మ తల్లి ఇచ్చిన శిరోమణి మూటను శ్రీరాముని కినర్తా ఆనాటి ఈనాటి రెండు బంగారు ఆభరణాల మూటలను తీసుకొనవలసిందని శ్రీరామునికి హనుమంతుడు సమర్పించుకునే విధానాన్ని అన్నమయ్య అద్భుతంగా తెలియజేస్తున్నాడు.

రాగము : వేళావళి

పల్లవి : అన్నియునందె యున్నవి అదిగో మూట
యెన్నుకొని దినములు ఇదిగో మూట ॥ అన్ని ॥

67

1. సీతనీకుఁజెప్పి పంపి శిరోమణి నీకిచ్చె
నాతల మేమెఱఁగము అదే మూట
చేతినీ వుంగరమును శిరసున నెత్తుకొని
యే తలఁపు లెట్లానో ఇదిగో మూట ॥ అన్ని ॥

2. తాడు పడ్డ మేని తోడ తలఁపు నీ కొప్పగించి
యేడవుతా నెఱఁగదు ఇదివో మూట
పాడి దప్పదించు కంతా పదిల మాకె గుణము
ఆడ నేమీ (జోటు లేదు అదిగో మూట ॥ అన్ని ॥

3. తెఱవ నీకు బాసిచ్చె దేవతల మూట విను
యెఱిఁగినదే ఇందరు ఇదిగో మూట
గుఱుతై శ్రీవేంకటాద్రిఁగూడితిరిద్దరు మీరు
అఱిముఱి రామచంద్ర అదిగో మూట ॥ అన్ని ॥

అ.శృం.సం.సం. 25 . 496

సీతమ్మకు సంబంధించిన ఆభరణాలన్నీ ఇందులో ఉన్నాయి. అదిగో ఆనాడు అమెదిగావేసిన మూట. ఎన్ని దినాలైందో ఈ నాటిమూట ఇక్కడుండి అంటూ హనుమంతుడు శ్రీరామునికి బంగారునగమూట అందిస్తూ ఇలా పలుకుతున్నాడు.

సీతమ్మతల్లి చెప్పిపంపింది. తలను ధరించేమణి నీకిచ్చింది. ఆ తర్వాత దాని స్మృతులకు సంబంధించిన మూట మాకు తెలియదు. నీవిచ్చిన చేతి ఉంగరాన్ని ఆమెకందజేయగా ఆమె ఆ ఉంగరాన్ని కళ్ళకద్దుకొంది. ఆమె భావనలేమో ! అదలా ఉండనియ్యి ఈ మూట తోసికో !

దుఃఖంతో కూడిన శరీరంతో తన భావాలను నీకప్పగించి రక్షకుడవు నీవెక్కడున్నావోయని తెలుసుకోలేకపోయింది.

కొంచెమైనా న్యాయం తప్పకుండా ఉంది. ఆమె గుణం (శీలం) పదిలంగా ఉంది. అక్కడివ్యక్తి హృదయంలో ఏమీ చోటులేదు. అదిగో మూట చూడు !

నీకామె బాసచేసింది. ఇది దేవతలమూట. ఇందరికీ తెలిసిందే. ఇదిగో మూటతీసికో ! మీరిద్దరూ శ్రీవేంకటాద్రిమీద కలుసుకున్నారు.

అదిగో మూట తీసుకో ! తొందరగా అని వినయంగా మనవి చేసుకొనే హనుమంతుని స్వామి భక్తిని తెలియజేస్తున్నాడు అన్నమయ్య.

## సంక్షిప్త యుద్ధకాండ

ఈ సంకీర్తనలో యుద్ధకాండ కథ సంక్షిప్తంగా తెలియజేయడం జరిగింది. శ్రీరాముడు సువేల పర్వతం మీద వానర సేనలతో కూడి విడిది

చేయడం. యుద్ధంలో శ్రీరాముడు, కుంభకర్ణుడు, రావణుడు మొదలైన రాక్షసులను చంపడం, విభీషణునికి పట్టాభిషేకం చేయడం, ఆ తర్వాత సీతమ్మను పిలువనంపడం మొదలగు విషయాలను రమణీయంగా వివరించడం జరిగింది.

రాగము : సాళంగము

**68**

పల్లవి : అదే రాముఁడు సువేలాద్రిపై నిలిచె
యెదిరితివి సీత యిఁక నేమమ్మా ! ॥ అదే ॥

1. దనుజులు వారేరు తలఁకేరు లంకలో
వనజాప్తు కులుఁడు వచ్చెనమ్మా !
వినవచ్చెను కపివీరుల యార్పులు
వెనుకొని పవుఁజులు విడిసెనమ్మా ! ॥ అదే ॥

2. కదనములో కుంభకర్ణాది వీరులు
మదమున బయిపడి మడిసిరమ్మా !
చిరుమఁగ రావణుచేతులు ఁదలలు
నిధుల నెల్లా నిన్ను నిండెనమ్మా ! ॥ అదే ॥

3. పతి విభీషణుని పట్టము గట్టెనమ్మా !
అతఁడు నిన్ను ఁ బిలువనంపీనమ్మా !
కతగా శ్రీవేంకటగిరి మీఁదను
యితవుగ ఁగూడరో యిపుడేమమ్మా ! ॥ అదే ॥

అ.శృం. సం.సం. 26 . 178

అదిగో ! శ్రీరాముడు సువేలాద్రి పైకి వచ్చి దండుతో నిలిచినాడు. నీవు రావణున్ని ఎదిరించినావు. ఇకనీకు కష్టం లేదమ్మా ! అని భక్తులు ఆమెను ఊరడిస్తూ ఉన్నారు.

అమ్మా ! సీతమ్మ తల్లీ ! లంకలోని రాక్షసులు పరుగెత్తిపోగలరు. భయ

పడగలరు సూర్యవంశపుకులం వాడైన శ్రీరాముడు వచ్చినాడు. వానరవీరుల ఉచ్ఛ్వాస నిశ్వాసలతో కూడుకొన్న సేనలు విడిది సేసినాయి.

యుద్ధంలో కుంభకర్ణుడు మొదలైన వీరులు మదించి మరణించినారు. రావణుని చేతులు తలలు నరుకగా వారి సంపదలు నీవెంట నిండుగా పారాడుతున్నాయి.

రాక్షసనాయకుడైన విభీషణునికి పట్టాభిషేకం చేసినాడు. ఆ శ్రీరాముడు నిన్ను రమ్మని పలికినాడు. మీ జీవనం ఒక కథ అయినది. మీరిద్దరు శ్రీవేంకటగిరి ఇప్పుడే ప్రేమమీద చేరుకోవల్సిందని ఆకాంక్షిస్తున్నారు భక్తులు.

## శ్రీరామునిపై ఒక ప్రియురాలి ప్రేమ

శ్రీరాముడు సీతాస్వయంవరంలో ధనుస్సునెక్కు పెట్టినాడు. ధనుస్సు నెక్కుపెట్టినందున సీత తనదైంది. అంతకు మునుపె ఆయనకు కామించిన ఒక స్త్రీ తనలో ఇలా అనుకుంటూ ఉంది.

రామా ! ఓ రామా ! సీత, నేను ఇద్దరిలో నీవు ఎవరిని మెచ్చుతావు ? ఈ విషయాన్ని గూర్చే దేవతలు ఇంచుక ఆలోచించినారు అని ప్రశ్నిస్తూ తక్కిన మూడు చరణాలలో సమాధానం చెబుతున్నాడు.

రాగం : శుద్ధవసంతం

పల్లవి : ఎవ్వరి మెచ్చఁదగవు యిద్దరిలో రామ రామ
రవ్వగా సురలు విచారము సేసేరిందుకే ॥ ఎవ్వరి ॥

1. దశరథ యజ్ఞములో తగ నీవు జనియింప
దశకంఠు మేనఁ బుట్టే దావాగ్ని
దశమైన శాంతితో వర్ణనకెక్కితి నీవు
దశకంఠుడంటి (ది?) నట్టి ధర్మమందెసమసె ॥ ఎవ్వరి ॥

69

2. నెఱి ( దొల్లి సీతకుఁగా నీవు విల్లెత్తఁగాను
చెఱకు విల్లెత్తె నీపె ( జేరి మరుఁడు
విఱిగె నీవెత్తి నట్టి విల్లయితే నెంతైన
విఱుగ కాతని విల్లు వెసఁబెండ్లిసేసెను ॥ ఎవ్వరి ॥

3. శ్రీవేంకటాద్రి మీద జేరి యెక్కితివి నీవు
ఆమెలఁది నీవుర మట్టె మెక్కెను
దేవుడవై ఇందరిలో ఁదిరుగాడుదువుగాని
వోవల నాకైతే నీపై వున్నచోనే వున్నది ॥ ఎవ్వరి ॥

అ.శృం.సం.సం. 32 . 28

ఓరామా ! నీవు దశరథుని యజ్ఞంలో జన్మిస్తే రావణుని శరీరంలో కార్చిచ్చు (దావాగ్ని) పుట్టింది. నీవు అధీనమైన శాంతితో వర్ణింపబడినావు. దశకంఠున్ని గూల్చి ధర్మం స్థాపించినావు.

ముందు నీవు సీతకోసం విల్లుఎత్తితే మన్మథుడు నీపై చెఱవు విల్లెత్తినాడు. నీవు ఎత్తిన విల్లేమో విరిగింది. ఆయన విల్లేమో విరుగక నీకు పెండ్లి చేసింది.

ఆ తర్వాత నీ వేమో వేంకటాద్రిపర్వతం ఎక్కినావు. ఆ స్త్రీ నీ ఱొమ్ముపై ఎక్కికూర్చుంది. నీవు దేవుడవై ఇందరిలో తిరుగుతూ ఉన్నావు. నాకైతే నీపైనే మనసుంది. సీత, నేను మా ఇద్దరితో సీతనే కోరుకున్నావు కదా ! అని నిట్టూరుస్తూ ఉంది.

## శ్రీరాముని పెండ్లిసందడి

ఈ సంకీర్తనలో శ్రీరాముని వివాహవృత్తాంతం వర్ణించబడింది. సంకీర్తన సీతమ్మకు చెందినదైనప్పటికి రామ వివాహ వృత్తాంతం ఇందు వర్ణింపబడినందున శ్రీరామావతారపు సంకీర్తనగా తీసుకోబడింది. సీతారాముల వివాహంలో తెలుగు వారి వివాహాచారాలు ఇందు వర్ణింపబడినాయి.

రాగం : సాళంగనాట

పల్లవి : సిగ్గరి పెండ్లి కూతుర ! సీతమ్మ!
దగ్గరి సింగారబొమ్మ ! తలవంచకమ్మా ॥ ఎవ్వరి ॥

1. అల్లనాఁడే రాఘవుడు హరువిల్లువిరిచెను
యెల్లి నేఁడే పెండ్లాడీ నిదివో నిన్ను
మెల్లగా జనకుఁడు నిన్నిచ్చీనట వీఁడె
వెల్లవిరి నీమాట వినవమ్మా ! ॥ ఎవ్వరి ॥

70

2. అదె పెండ్లి తెరయెత్తిరండనే వసిష్ఠుఁడుండి
చదివీ మంత్రాలు సేస చల్లవమ్మా !
మొదల రాముని కంటె ముంచి తలఁబాలు వోసి
సుదతి యాతని మోము చూడవమ్మా ! ॥ ఎవ్వరి ॥

3. కంకణ దారాలు గట్టి కాలుదొక్కితివి మీరు
పొంకాన బువ్వమందరో పొత్తుల నమ్మ
వుంకువ వావిలి పాట నుండి శ్రీవేంకటగిరి
తెంకుల నిన్నుఁగూడి తిరమాయనమ్మా ! ॥ ఎవ్వరి ॥

అ.శృం. సం.సం. 32.40

సీతాదేవి వివాహసందర్భాన్ని మనసులో ఊహించుకొని ఈ సంకీర్తనను వ్రాశాడు అన్నమయ్య. సిగ్గుతోనున్న సీతమ్మ పెండ్లి కూతురు ! దగ్గరే ఉన్న సింగారపు బొమ్మా ! తలవంచమ్మా ! అనే పల్లవితో పాట ఆరంభించాడు. ఏనాడు శ్రీరాముడు శివధనుస్సును విరుచుగా ఆనాడే నిన్ను పెండ్లాడినాడు. జనకుడు నిన్ను రామునికిచ్చినాడు.

ఇదిగో ! ఈ మాట విను అదిగో పెండ్లితెర ఎత్తినాడు. వసిష్ఠుడు దగ్గరుండి వేదమంత్రాలు చదువుతున్నాడు. సేసలు చల్లవమ్మా ! రాముని కంటే ముందుగా నీవే ఆయన్ను తలంబ్రాలతో ముంచెత్తి ఆయన ముఖం చూడు.

కంకణదారాలుకట్టి కాలుదొక్కినావు. అలాంటి నిన్ను వావిలి పాటిన

ఉన్న శ్రీవేంకటగిరి శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కూడినాడు కదా ! అని ఆమెతో చెబుతున్నట్టు ఉంది. బహుశా శ్రీరామనవమి సందర్భాలలో పెండ్లికూతురుయైన సీతమ్మను చూసి అన్నమయ్య పాడినట్లుంది.

## శ్రీరాముని సోయగాలు

ఒక మదవతి తన చెలికత్తెతో వావిలిపాటిలో వెలసిన రామచంద్రుని గూర్చి ఆయన సౌందర్యాన్ని, వర్ణిస్తూ ఆయనను నీ చూచి నవ్వమనీ, మ్రొక్కమనీ, సిఫారసు చేస్తూ ఉంది

రాగం : శుద్ధవసంతం

పల్లవి : వీఁడివో అలవిజయ రాఘవుఁడు
పోఁడిమిఁ గొలువునఁ బొదలీ ఁజెలియా ! ॥ వీఁడివో ॥

71

1. రాముఁడు లోకాభిరాముఁడు గుణ
ధాముఁడు సురులకు దమనుఁడు
తామర కన్నుల దశరథ తనయుఁడు
మోమున నవ్వీ మొక్కవె చెలియా ॥ వీఁడివో ॥

2. కోదండధరుఁడు గురుకిరీటపతి
పోడిగ సురముని పూజితుఁడు
ఆదిమ పురుషుఁడు అంబుదవర్ణుఁడు
నీదెస చూపులు నించీఁ జెలియా ॥ వీఁడివో ॥

3. రావణాంతకుఁడు రాజశేఖరుఁడు
శ్రీవేంకటగిరి సీతాపతి
వావిలి పాటిలో వరమూర్తి దానై
వోవరిఁ గొలువున నున్నాఁడే చెలియా ! ॥ వీఁడివో ॥

అ.శృసం.సం. 32.'52

ఓ చెలియా ! వీడె ! అలనాటి రఘుకులానికి చెందినవాడు.

ఓ సఖీ ! ఈయన రాముడు, లోకాలకు అభిరాముడు గుణాలకు

నిలయుడు. దేవతలను శాసించువాడు. తామరకన్నుల వంటి కన్నులుగల ఇతడు దశరథుడు కొడుకు.

కోదండాన్ని ధరించినవాడు. గొప్పనైన కిరీటాన్ని ధరించినవాడు. దేవతలతోను మునులతోను పూజింపబడినవాడు. మొదటిపురుషుడు మేఘపురంగు కల్గిన వాడు. ఓ చెలీ ! అతడు నీవైపే, చూస్తున్నాడు.

ఓ చెలియా ! రావణున్ని చంపినవాడు. రాజులచే తలపై నుంచుకోబడేవాడు. వేంకటాద్రిపర్వతము పైని సీతాపతి ఈయనే. ఆయనే ఈ వావిలి పాటిలోని శ్రీరాముడు.

## శ్రీరామునిపై మరులు గొన్న ప్రేయసి

ఒక జవరాలు వావిలి పాటి శ్రీరామ చంద్రునిపై మరలుగొనింది. శ్రీరాముడేమో ఏక పత్నీవ్రతుడు, అయినా నీ పొందు నాకు కావాలంటుంది. నీవు ఏక పత్నీవ్రతుడలా ! అహల్యను స్పర్శించినావు కదా ! అని ఆమెను ఉదా :- చూపుతూ నన్నూ ఏలుకో ! అంటూ రామచంద్రుని వెంటబడుతూ ఉంది.

రాగం : రామక్రియ

పల్లవి: రాతి బతిమ సేసిన రామచంద్రనీ
చేతిలోని దాననింతే శ్రీరామచంద్ర ॥ రాతి ॥

1. వట్టిరట్టు సేయకిఁక వద్దు రామచంద్ర
నెట్టన నే దూరనోప నిను రామచంద్ర
వొట్టితి బ్రేమము నీపై వో రామచంద్రమమ్మ
దట్టి జాలిఁ బెట్టకిఁక వద్దు రామచంద్ర ॥ రాతి ॥

72

2. విన్నపాలు వేయునేల ! విను రామచంద్ర! నా
కన్నులకు నీవె గుటి ఘన రామచంద్ర !
యెన్నిక నన్నుఁబాయకు మిఁక రామచంద్ర !
నిన్ను నన్ను నెంచుకొమ్మి ! నీవు రామచంద్ర ! ॥ రాతి ॥

3. ఆయములంటితివి నెయ్యపు ం రామచంద్రనొక్క
పాయమె ఇద్దరికిని బలు రామచంద్ర
ఆయెడ వావిలి పాటి హరి రామచంద్ర
చేయార శ్రీవేంకటాద్రిఁజెందితి రామచంద్ర ! ॥ రాతి ॥

ఓ రామచంద్రా ! నీవు రాయిని స్త్రీగా మార్చినావు. నేనునీ ఆధీనంలో ఉన్నాను.

నన్ను ఊరక ఆరడి చేయువద్దు. నీవు చేవట్టకపోతే నేను దూరంగాపోలేను.నా ప్రేమపై ఒట్టు. నాపై ఇక జాలిచూపవద్దు.

రామచంద్ర ! వేయి విన్నపాలు ఏల ! నాకన్నులకు నీవే గురి ఐనావు. నా ఎన్నికనీవు. నన్ను వదల వద్దు. నీవు నన్ను ఎన్నుకో

ఓ నా స్నేహపు రామచంద్ర ! నీవు రహస్యాంగాలను అంటినావు. మన ఇద్దరికి వయస్సుంది. ఒకే వయస్సు. ఇక ఎందుకు నీవు వావిలి పాటినుండి వేంకటాద్రి చేరుకున్నావు. రా! అంటూ ఆ స్వామిని కవ్విస్తూ ఉంది.

ప్రతిపాదంలోను రామచంద్ర అనే పదాన్ని ఉంచడం ఇందలి విశేషము.

ఏకపత్నీవ్రతుడైన రామచంద్రుని పొందకోరుతూ ఉంది ఈ మదవతి. అహల్యను తాకినావు కదా ! ఫరవాలేదు అని అంటూ ఉంది. శ్రీరామునిపై ఇంత ఘాటైన ఏ శృంగార సంకీర్తనాలేదు అనేలోటు తీర్చడానికో ఏమో ! అన్నమయ్య ఈ సంకీర్తన వ్రాసినట్లు ఉంది. ఇది కవి కల్పనాబలమే. కాముకి అంతరంగమే కాని వాస్తవానికి శ్రీరామునికాభావం లేదీ సంకీర్తనలో. ఇలాంటి శృంగార సంకీర్తన వేరొకటి ఇంతకుముందే "ఎవ్వరి మెచ్చదగవు ఇద్దరిలో" అనే పల్లవితో చెప్పడం జరిగింది. ఈ రెండు శృంగార సంకీర్తనలు తప్ప వేరొకటి లేదు. ఈ రెండూ కూడా ఆయాస్త్రీల మానసిక భావాలేకాని శ్రీరామునిలో ఆ భావాలు లేవు. కావున ఆయన ఏకపత్నీవ్రతుడు.



సమాప్తం.

# అప్రకాశిత గ్రంథాలు

1. శ్రీమలయాళ యతీంద్ర జీవనచరితం (అనువాదగ్రంథం)
2. శ్రీమలయాళ యతీంద్ర శతకం (సంస్కృతం)
3. సిద్ధిత్రయం (విశిష్టాద్వైతానువాదగ్రంథం)
4. శ్రీ వేంకటేశ్వర శతకం (సంస్కృతం)
5. శ్రీమదయ్యప్ప పూజా విధానం (సంకలనం)
6. సంస్కృత శిక్షణే ప్రాయోగికాధ్యాపన విధానం (హిందీ)
7. సంస్కృతాధ్యాపనం (హిందీ)
8. విప్లవ వాల్మీకీయం (హిందీ)
9. వృక్ష వేదం (హిందీ)
10. మహాభారతం - మోక్షధర్మపర్వం (2,3,4,5, భాగాలు)
11. అన్నమాచార్య సంకీర్తనలు - దశావతారాలు (వ్యాఖ్యాగ్రంథం)
12. అన్నమాచార్య సంకీర్తనలు - శ్రీనరసింహావతారము(వ్యాఖ్యాగ్రంథం)
13. అన్నమాచార్య అధ్యాత్మసంకీర్తనలు - శ్రీకృష్ణావతారము(వ్యాఖ్యాగ్రంథం)
14. అన్నమాచార్య శృంగారసంకీర్తనలు - శ్రీకృష్ణావతారము(వ్యాఖ్యాగ్రంథం)
15. అన్నమాచార్య సంస్కృత సంకీర్తనలు(వ్యాఖ్యాగ్రంథం)
16. లోకాలోకాలు - పునర్జన్మలు
17 ధర్మరథం
18. భక్తిప్రకారాలు - వివరణ
19. సంకీర్తనామాధుర్యం
20. ఆచార్యమహత్త్వం
21. భగవంతుడు -తత్స్వరూపం
22. మోక్షపురుషార్థ మర్మాలు



డాక్టర్ కానాల నలచక్రవర్తి
ప్రవాచకులు
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం,
(డీమ్డ్ యూనివర్సిటి)
తిరుపతి - 517 507 ఆం.ప్ర

తల్లిదండ్రులు: వేంకటాంబ, వేంకట సుబ్బయ్య

జన్మస్థానం : కానాల (గ్రామం), నంద్యాల (మండలం), కర్నూలు (జిల్లా)

విద్యార్హతలు : వ్యాకరణశిరోమణి, శిక్షాశాస్త్రి ఎమ్.ఎ. (సంస్కృతం), ఎమ్.ఎ. (తెలుగు), ఎమ్.ఎడ్. (ఆంగ్లం), విద్యావారిధి (పి.హెచ్ డి.) విషయం: ఆంధ్రప్రదేశంలో స్వాతంత్ర్యోత్తర కాలం తర్వాత సంస్కృతవిద్య ప్రగతి యొక్క ఐతిహాసిక సర్వేక్షణం) (విద్యావాచస్పతి, శ్రీమద్రామాయణంలో వాల్మీకి మహర్షి విప్లవాత్మక భావాలు)

ప్రకాశితగ్రంథాలు :

1. వ్యాస సిద్ధాంత మార్తాండం (విశిష్టాద్వైత అనువాద గ్రంథం)
2. శ్రీమదయ్యప్పగీత (అద్వైత వేదాంతానువాద గ్రంథం )
3. శ్రీమధ్వ మంత్రార్థమంజరి (ప్రకాశిత తాళపత్ర గ్రంథం)
4. సంస్కృత శిక్షణే ప్రాయోగికాధ్యాపన విధానం (శిక్షాశాస్త్రం)
5. సంస్కృతాధ్యాపనం (శిక్షాశాస్త్రం)
6. మహాభారతం - మోక్షధర్మపర్వం
7. తెలుగుబోధన విధానం (అనువాద గ్రంథం - మొదటి భాగం)
8. విప్లవ వాల్మీకీయం (ప్రముఖ విమర్శగ్రంథం)
9. వృక్షవేదం (చెట్ల గొప్పదనం)